Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆలమందలు ఇళ్ల కొచ్చేటి వేళ

పంపినవారు:
అర్. నాంచారమ్మ - నర్సాపురం

# చందమామ

## దీపావళి (నవంబరు) ప్రత్యేక సంచిక

రెట్టింపు పేజీలతో ఆకర్షవంతంగా వెలువడనున్నది.



- ★ నవరసభరితములైన కథలు
- ★ నవనీతతుల్యములైన గేయాలు
- ★ రంగురంగుల చిత్రాలు
- ★ రమణీయమైన మల్టికలర్ ఆఫ్‌సెట్ ముఖచిత్రం
- ★ చమత్కారమైన హాస్యరచనలు
- ★ చక్కని వార్తలు, విశేషాలు, వైజ్ఞానిక విషయాలు

**వెల 12 అణాలు**



ఏజెంట్లు త్వరలో తమ ఆర్డర్లను
పంపవలసిందిగా కోరుతున్నాము.

సర్క్యులేషన్ మేనేజరు,
**చందమామ పబ్లికేషన్స్**
మద్రాసు - 26.

# చందమామ

## ఈ సంచికలో



ఇవిగాక:

హాస్యకథలు, రంగులబొమ్మ కథ - ఫోటో శీర్షికల పోటీ, చిత్రకథ, వార్తలు - విశేషాలు మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

---

"చందమామ"లో పాఠకులు పంపే కథలూ, హాస్యాలూ బాగుంటే వేసుకుంటాము. "చందమామ"లో ప్రచురణార్థం పాఠకులు మంచి బొమ్మలనూ, కార్టూనులనూ, కార్టూను కథలనూకూడా పంపవచ్చు. రచనలూ, బొమ్మలూకూడా స్వతంత్రంగా రచించినవై ఉండాలి.


చందా వివరములు:

చందమామ (ఏ భాషలోనైనా)

విడి సంచిక 0-6-0 సంవత్సర చందా రు. 4-8-0



# ఒళ్లు పులకరించేలా చేసే పరిమళము

దంతపు రంగు జై సబ్బు మీ స్నానమును ఆహ్లాదకరము చేస్తుంది; దాని సువాసన మీ జీవితము ఉల్లాసమయము చేస్తుంది. జై యొక్క వెల్వెట్‌వలె మెత్తని నురుగు, దాని రమ్యమైన పరిమళము మరియు దాని చాలకాలము ఉండే మన్నికలు దానిని సరసమైన ధరలో దొరకే ఒక దర్జా అయిన సబ్బును చేస్తున్నాయి




## జై

టాయిలెట్ సబ్బు

తాతా తయారు

భారతదేశపు పెట్టుబడితో, భారత నిర్వహణ క్రింద, భారతదేశములో తయారవుతున్నది

**తాతా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్**



వినోదా వారి

# కన్యాశుల్కము

సావిత్రి.. యన్.టి.రామారావు.. జానకి .. సి.యస్. ఆర్.
డా॥ సుబ్బారావు.. గుమ్మడి.. రామన్న పంతులు.. వంగర
బి.యస్.ఆర్..సూర్యకాంతం..ఛాయాదేవి..హేమలత..అడ్డాల
చదలవాడ..గౌరీపతి శాస్త్రి.. *మాష్టర్* సుధాకర్.. *మాష్టర్* కుందు.రామకోటి
శేషగిరి రావు..మోపర్రుదాసు.. *కుమారి* ప్రమీలారాణి.. *కుమారి* సుభద్ర & పేకేటి..



వెలువడినవి!

## విచిత్ర కవలలు

శరవేగంతో నడిచే సంఘటనలతో, మనస్సును కదిలించే సన్నివేశాలతో కూడిన రసవత్తర కథ!

ఆకర్షణీయంగా కనులవిందుగా తయారుఅయిన పుస్తకం.



వెల : ఒక రూపాయి

పోస్టేజి 0-2-0 అదనము. 1-6-0 పంపిన కాపీ రిజిష్టర్డు పోస్టుద్వారా పంపబడును.



## జాతక కథలు

(బుద్ధుని పూర్వజన్మములు)

పుస్తకరూపంలో అందంగా వెలువడినవి.

వెల : 0-12-0

పోస్టేజి : 0-2-0 అదనము.



చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మద్రాసు - 26.

For

PLEASANT READING & PROFITABLE ADVERTISING

## Chandamama Group

SERVING THE YOUNG WITH A FINE PICTORIAL STORY FARE

THROUGH

CHANDAMAMA

(TELUGU, HINDI, KANNADA, GUJARATI, ENGLISH)

AMBULIMAMA

(TAMIL)

AMBILI AMMAVAN

(MALAYALAM)

AND

CHANDOBA

(MARATHI)

CHANDAMAMA PUBLICATIONS

VADAPALANI :: MADRAS-26



'my skin needs a pure soap!"





## చందాదారులకు మనవి

*

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదో తేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మన పూర్వీకులు ఆవిరిశక్తీ, విద్యుచ్ఛక్తీ, యంత్ర శక్తీ ఎరగరు. యంత్ర యుగంలో జీవించే మనం అడుగడుగునా అంతులేని శక్తి ఉపయోగిస్తున్నాం. మన కారూ, బస్సులూ, రైళ్ళూ శక్తితో నడుస్తాయి. మన బట్టలు యంత్ర మగ్గాలమీద నేసినవి. మన పుస్తకాలూ, పత్రికలూ అచ్చువేసే యంత్రాలు శక్తితో నడుస్తాయి. దీపాలు విద్యుచ్ఛక్తితో వెలుగుతాయి. మనం ఒకవంక శక్తిని వినియోగపరుస్తుంటే, రెండోవంక శక్తి సాధనాలు—బొగ్గు, పెట్రోలు మొదలైనవి—తరిగిపోతున్నాయి. అయితే అదృష్టవశాత్తూ మానవుడు అతి సూక్ష్మమైన పరమాణువులో దాగివున్న అంతులేని శక్తిని బయటికి తీసుకుని ఉపయోగపరచటం నేర్చుకున్నాడు. పరమాణుశక్తి యుగం ఇప్పుడే ఆరంభమవుతోంది!


సెప్టెంబరు
1955





సంపుటి 17
సంచిక 3

# పరీక్ష

నాగలాపురంబు నేలు
నరపాలుం డొకనాడు
మంత్రి నెన్నుకొనగ తాను
మంచి పరీక్షను బెట్టెను !

అట వచ్చిన అభ్యర్థుల
నడిగె కొన్ని ప్రశ్నల !
" అదిగో ఆ బాటలో
అరుగుచున్న బండిలో

ఉన్న దేమి చెప్పం" డని
అన్నాడా ప్రశ్నను విని—






బండి నిండు కున్నయట్టి
పండ్లను గని తిరిగి వచ్చి

తాజా మామిడిపండ్లని
రాజాగారికి చెప్పిరి !
చూడామణి యను యువకుఁడు
సూక్ష్మబుద్ధి గలవాడు

సాగె బండితో నడచుచు
సర్వ విషయముల నెరుగుచు !
" ఏమి రకము లా పండ్లు ?
ఎరిగి రండు పో పొండు "

అని రాజన అభ్యర్థులు
విని తీసిరిగా పరుగులు !



## గేయ కథ

అన విని మళ్లీ పరుగిడి
రంతలోన చూడామణి

చెంతజేరి సమస్తమును
చెప్పినంత సంతసించి
మెచ్చి ముఖ్యమంత్రి పదవి
నిచ్చె రాజు అతనికి!

విషయ మడిగి రండనగ
వివరంబుల సంపూర్తిగ
సేకరించగల ఓపిక
లేకుండిన ఫలమేదిక?

బండివాని కలుసుకొని
పండ్లరకము దెలుసుకొని

మలుగూబా పండ్లవి యని
మరలి వచ్చి చెప్పగ విని—,
"ధర యెంతో అడగండని"
తరిమె రాజు అందరిని.

పరుగు పరుగుతో వెళ్లిరి
బండివాని కలుసుకొనిరి
రూపాయకు నాల్గేనని
పాపం! రొజుచు వచ్చిరి!

"ఏ ఊరిది ఆ బండి?
ఎరిగి మీరు మళ్లి రండి"



# అట్టవిూది బొమ్మ

కప్పరాజు కుమార్తె శోభనతో పరీక్షితుడు చాలాకాలం సుఖంగా ఉన్నాడు. అతనికి శలుడు, బలుడు, దలుడు అనే ముగ్గురు పుత్రులు కలిగారు. పరీక్షితుడు, పెద్దవాడైన శలుడికి రాజ్యం వప్పగించి వానప్రస్థాశ్రమం స్వీకరించాడు.

ఒకనాడు శలుడు వేటకుపోయి, ఒక జింకను వెంటాడాడు. అతని గుర్రాలు జింకతో పరుగెత్తలేక, అలసిపోయినవి. అప్పుడు సారథి "రాజా!—ఇక్కడ సమీపంలో వామదేవరుషి ఆశ్రమం ఉన్నది. ఆయనవద్ద అసామాన్యమైన అశ్వాలు ఉన్నట్లు విన్నాను. అవి మనకు లభ్యమయితే ఆ జింకను మనం వేటాడగలము," అని చెప్పాడు.

ఆ ప్రకారం శలుడు వామదేవరుషిని కోరగా, గుర్రాలనుయిస్తూ, 'సరే, నీ పని తీరగానే వాటినితెచ్చి వప్పగించు' అన్నాడు. శలుడు గుర్రాలను తీసుకు వెళ్ళి, జింకను వేటాడాడు. తరవాత—గుర్రాలను రుషికి వప్పగించక, వాటిని తీసుకుని తిన్నగా రాజనగరు చేరుకొన్నాడు.

రుషి ఒక నెలవరకు శలుడికోసం నిరీక్షించి, ఒక శిష్యుణ్ణి పంపించాడు. శలుడు గుర్రాల నివ్వటానికి నిరాకరించాడు. అందుచేత రుషి స్వయంగానే వెళ్లి అడిగితే 'నీకు మరొక జత గుర్రాలను ఇస్తాను. వీటినిమటుకు ఇవ్వను' అని చెప్పాడు. రుషి కోపించి కొందరు రాక్షసులను సృష్టించాడు. వాళ్లు శలుణ్ణి వధించారు. శలుడి తమ్ముడు దలుడుకూడా, గుర్రాలను ఇవ్వను అంటూ రుషి పీడ వదుల్చుకుందామని అయనపైన బాణం ఎక్కుపెట్టాడు. రుషి 'ఇది నీ కుమారుణ్ణే చంపుగాక!' అని శపించేసరికి, అంతఃపురంలో ఉన్న వాని కుమారుడు శ్యేనజితుణ్ణి ఆ అంబుతాకి చంపివేసింది. పౌరుషంకొద్దీ దలుడు మరిఒక బాణం రుషిపైన ప్రయోగించబోగా, వాని హస్తం అలానే స్తంభించిపోయింది!

అప్పుడు దలుడి భార్య రుషి కాళ్లపైన పడి, 'మీ గుర్రాలను నేనిప్పిస్తాను. నా భర్తను రక్షించండి!' అని వేడుకున్నది. అప్పుడు రుషి దలుడుని కరుణించి శాపవిముక్తుణ్ణి చేయడమేగాకుండా, చచ్చిపోయిన అతడి కుమారుడు శ్యేనజితుణ్ణికూడా బ్రతికించాడు.

ఆనాడు కప్పరాజు తన కుమార్తె శోభనకు ఇచ్చిన శాపం ఈ విధంగా పరిసమాప్తి పొందింది.




# పితృద్రోహి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో బోధిసత్వుడు ఒక రైతు ఇంట జన్మించాడు. అతడిని తలిదండ్రులు చాలా గారాబంగా చూసుకునేవారు. వాళ్లు అతనికి కములుడు అని పేరు పెట్టారు.

కములుడు చిన్నతనంనుంచికూడా వయసుకు మించిన తెలివితేటలు కనబరుస్తూ వచ్చాడు. తల్లిదండ్రులు తనను ఎంత గారాబంగా చూసినా అతనికి తన తాతమీద ఎక్కువ మక్కువగా ఉండేది.

ఈ తాత చాలా ముసలివాడు. ఏ పనీ చేయలేడు. ఆయనకే మిగిలినవాళ్ళు ఉపచారాలు చేయవలిసి ఉండేది. ఇది కములుడి తల్లికి బాధగా ఉండేది. ముసలివాడు ఎప్పుడు పోతాడా అని ఎంతోకాలం చూసింది, కాని ఆయనమాత్రం చావలేదు.

ఒకరోజామె తన భర్తతో, "మీ నాయనతో నాకు ప్రాణం విసిగిపోతున్నది. మిగిలిన చాకిరీ ఒక ఎత్తూ ఆయన సేవ ఒక ఎత్తూగా వుంది," అన్నది.

"పెద్దవాడైపోయాడు. ఇంకెంతకాలం బతుకుతాడులే!" అన్నాడు రైతు.

"ఎంతమందికి చావు వచ్చినా ఆయనకుమటుకు రాదు. ఈ జన్మకిక నేను సుఖపడేదిలేదు," అన్నది రైతు భార్య.

"ఆయు వున్నన్నాళ్ళు బతకనీ? యేం చేస్తాం? చేతులారా చంపుకుంటామా?" అన్నాడు రైతు.

"ఏం చంపితే? బతికి ఆయనకు సుఖమా, మనకు సుఖమా? ముసలి ప్రాణాని కెంత కావాలి?" అన్నది భార్య.

రైతుకు తండ్రిని చేతులారా చంపటమంటే మొదట్లో చాలా ఘోరంగా కనబడింది. కాని పెళ్ళాం చాలా రోజులు పోరినమీదట, అందులో ఏమంత తప్పు లేదనిపించింది.






బయలుదేరాడు. వాళ్ళు వెళ్ళే దారిలో ఒక చిన్న అడివి ఉంది. రైతు అడివిమధ్య బండీ ఆపి, "ఇప్పుడే వస్తా!" అంటూ బండి జల్లలో ఉన్న పార ఒకటి తీసుకుని చెట్లమధ్యకు వెళ్ళాడు.

కమలుడు తాతతో, "ఇప్పుడే వస్తా!" నని చెప్పి మరొక పార తీసుకుని తండ్రి వెనకే చప్పుడు కాకుండా వెళ్లాడు. కొంత దూరం వెళ్ళాక తండ్రి ఒక పొదపక్క గొయ్యి తవ్వుతూ కమలుడికి కనిపించాడు. కమలుడు అదే పొద అవతలివైపు చేరి అక్కడ తానుకూడా ఒక గొయ్యి తవ్వ నారంభించాడు.

ఆ చప్పుడు విని రైతు తన పని ఆపి పొద అవతలికి వెళ్ళి, కొడుకును చూసి ఆశ్చర్యపోతూ, "ఎందుకక్కడ గొయ్యి తవ్వుతున్నావు?" అని అడిగాడు.

కమలుడు తండ్రిని చూసి, "నువ్వెందుకు తవ్వుతున్నావో అందుకే?" అన్నాడు.

"నే నెందుకు తవ్వుతున్నానో నీకు తెలుసునా?" అని అడిగాడు రైతు.

"నాకు తెలీదు. ఎందుకు తవ్వుతున్నావు?" అన్నాడు కమలుడు.

"నా తండ్రిని పూడ్చటానికి గొయ్యి తవ్వుతున్నాను! ఆయన చస్తే పాతిపెట్టాలి

చివరకు రైతు తన తండ్రిని యెవరికీ తెలియకుండా చంపి మాయం చెయ్యటానికి ఒక ఉపాయం ఆలోచించాడు. ఆయన తన తండ్రిదగ్గిరికి వెళ్ళి, "నాన్నా పొరుగూళ్లో అప్పు మాట్లాడాను. వాళ్లు నువు రాకపోతే ఇవ్వమన్నారు. ఓపిక చేసుకుని బండిమీద బయలుదేరు," అన్నాడు.

ముసలివాడు నిజమేననుకుని బయలుదేరాడు. తాతను విడిచి ఒక్క క్షణం ఉండని కమలుడుకూడా ఎవరు చెప్పినా వినక, బండీ ఎక్కి కూచున్నాడు.

తప్పేదిలేక రైతు తన తండ్రినీ, కొడుకునూ వెంటపెట్టుకుని బండి తోలుతూ

సిన విధి నాకున్నది, ఎందుకంటే నేనాయన కొడుకును," అన్నాడు రైతు.

"ఆయన ఇంకా బతికే ఉన్నాడుగా ?" అన్నాడు కమలుడు.

"ప్రాణం శాశ్వతమా ?" అన్నాడు రైతు.

"నా తండ్రి చస్తే పాతెయ్యవలసిన విధి నాకూ ఉన్నది. నీ ప్రాణంమాత్రం శాశ్వతమా ?" అన్నాడు కమలుడు.

రైతుకు తల కొట్టేసినట్టయింది. తన కొడుకు ఈ మాట అన్నదాకా, తాను ఎంత నీచమైన పని చేస్తున్నదీ రైతుకు తెలిసి రాలేదు. ఆయన సిగ్గుపడి, పార తీసుకుని, "పోదాం పద !" అన్నాడు. కమలుడుకూడా తవ్వటం మానేసి తండ్రి వెంట వచ్చేశాడు.

రైతు బండిని వెనక్కు మళ్ళించి ఇంటికి తిరిగివచ్చాడు.

ఈలోపల కమలుడి తల్లి, మామ చచ్చిపోయినట్టే భావించి, ఆనందంకొద్దీ పిండి వంటలు చేసి భర్తకోసం, కొడుకుకోసం ఎదురు చూస్తున్నది.

తిరిగివచ్చిన బండిలో మామ ఉండటం చూసి ఆవిడకు చాలా ఆశాభంగమయింది. రైతు తన భార్యతో జరిగినదంతా చెప్పాడు. కమలుడు చేసిన పని తలుచుకుని రైతు భార్యకు గుండె చితికినట్టయింది.

"వాణ్ణి ఎంత ప్రేమగా పెంచుతున్నాం ! ఇట్లా తండ్రికే గొయ్యి తవ్వుతాడా ? ఇక వాడి ముఖం చూసేదెట్లా ?" అన్నదావిడ భర్తతో.

"నా తండ్రి నన్ను గారాబంగా పెంచలేదా ? నేను చేద్దామనుకున్నదేమిటి ? మన కొడుక్కు మనమీద అపేక్ష లేకకాదు. మనకు గుణపాఠం నేర్పటానికి అట్లా చేశాడు ! ఇకనైనా వాణ్ణి చూసి బుద్ధికలిగి ఉందాం !" అన్నాడు రైతు.

తరవాత కమలుడి తండ్రిగాని, తల్లిగాని ఎటువంటి నీచకార్యానికీ పూనుకోలేదు.



హాస్యం

# జంతువులనుంచి గుణపాఠం

ఒక కాపుకు పశుపక్ష్యాదుల భాషలు తెలుసు. అతను చాలా నెమ్మదైనవాడు. అతని భార్యమాత్రం చాలా గడుసుది. ఒకనాడు రెండు గాడిదలు ఏదో మాట్లాడుకుంటుంటే విని కాపు నవ్వాడు. "ఎందుకు నవ్వావు?" అని భార్య అడిగింది.

"గాడిదలేవో మాట్లాడుకుంటుంటే విని నవ్వొచ్చింది!" అన్నాడు కాపు.

"అబద్ధం గాడిదలు మాట్లాడటమేమిటి? నీకు నవ్వొచ్చే సంగతి ఏం మాట్లాడాయి?" అన్నది భార్య

చెబితే తనకు చావు తప్పదని తెలిసి కాపు గాడిదల సంభాషణ చెప్ప లేదు. కాని పెళ్లాం అతన్ని చెప్పమని వేధించసాగింది. ఈ బాధపడేకన్న చావే మేలని నిశ్చయించుకుని, తన చావుకు సమస్తమూ సిద్ధం చేసుకుని, దక్షిణంగా తలపెట్టుకుని నేలమీద పడుకుని కాపు తన భార్యకు గాడిదల సంభాషణ చెప్పటానికి ఉద్యుక్తుడైనాడు.

ఈ సమయంలో అతని పెంపుడు కుక్క విచారంగా వచ్చి అతని పక్కనే కూచుంది. కోడిపుంజు వచ్చి సంతోషంగా గంతులేస్తూ ఎగరసాగింది.



"ఆనందంగా గెంతటానికి ఇదే నాసమయం?" అని కుక్క కోడిపుంజును కోప్పడింది.

కోడిపుంజు కోపంగా, "ఏమన్న మగాడు? నాకూ యాభైమంది పెళ్లాలున్నారు. ఒక్కరుకూడా నామాట జవదాటటానికి వీలులేదు. ఈయన ఒక్క పెళ్లాన్ని అదుపులో పెట్టుకోలేడా?" అన్నది.

ఇది వింటూనే కాపు చివాలున లేచి, పలుపు తీసుకుని పెళ్లాన్ని గట్టిగా కొట్టాడు. ఆ క్షణంనుంచీ కాపు ఇంట్లో శాంతి ఏర్పడింది.

# మకర దేవత

## 3

[నిరాయుధుడైన మందరదేవుణ్ణి బంధించి సముద్రతీరంకేసి తీసుకుపోతున్న ద్రోహులిద్దరూ, హఠాత్తుగా పిడుగుపడి మరణించారుగదా? తరవాత మందరదేవుణ్ణీ, అతడి సైనికులనూ కుండలినీ ఆశ్వికులు ముట్టడించారు. అప్పుడు జరిగిన పోరాటంలో ఆశ్వికులలో చచ్చినవారు చావగా మిగిలినవారు కోటవైపుకు పరుగెత్తారు. తరవాత—]

మందరదేవుడి ముఖ లక్షణాలనుబట్టి, ఆయన ఏదో దీర్ఘాలోచనలో వున్నాడని సైనికులు గ్రహించారు. ఆయన ఒకమారు సముద్రంకేసీ, కోటకేసీ చూసి పెద్దగా నిట్టూర్చాడు. సైనికులు తమ రాజును కలవరపరుస్తున్న సంగతి ఏమిటా అనుకునేంతలో మందరదేవుడు యిలా చెప్పాడు.

"మనం ఈ రాజ్యాన్ని ఎంత త్వరగా వదలిపోతే అంత క్షేమం. చావు దెబ్బలు తిని పారిపోయిన ఆ కుండలినీ అశ్వికులు, మననుగురించిన వర్తమానం వాళ్ళ నాయకుడికి తెలియబరుస్తారు. ఆతరవాత వాళ్ళు ఇనుమడించిన బలగంతో మనను ముట్టడిస్తారు. ఈ చిన్న పడవలలో యీ మహాసముద్రంమీద బయలుదేరి కానని ద్వీపాలకేసి మనం పోవలసి వుంటుంది. ఏ క్షణాన ఏ ప్రమాదం మనను చుట్టుముట్టుతుందో తెలీదు. మీ నలుగురుకూడా నాతోపాటు యీద్వీపాన్ని వదలదలుచుకున్నారా?" అని అడిగాడు.

అందుకు సైనికులు నలుగురూ ఏకకంఠంతో, "మహారాజా! మేం యింత



కాలంగా మీ ఆశ్రయంలో బ్రతికినవాళ్ళం. కష్టసమయంలో మిమ్మల్ని విడిచిపోయేంత విశ్వాశఘాతకులం కాదు," అన్నారు. మందరదేవుడు సైనికుల రాజభక్తిని మెచ్చుకుంటూ యిలా అన్నాడు.

"నేను మీ రాజభక్తిని శంకించటం లేదు. నావరకు నేను అవివాహితుణ్ణి. యుద్ధ ప్రకటనలాటి రాజధర్మాన్నికూడా పాటించకుండా, హఠాత్తుగా నా రాజ్యంమీద దాడి చేసి వశపరుచుకున్న నరవాహనమిశ్రుడిని ఏనాటికైనా హతమార్చటం తప్ప, నాకు మరో జీవితాశయంలేదు. కాని మీరు... భార్యాబిడ్డల్నీ, బంధువర్గాన్నీ...."



"అలాంటి బంధనాలేమీ మాకులేవు మహారాజా!" అన్నారు సైనికులు.

మందరదేవుడు సైనికులకేసి వాత్సల్యం వుట్టిపడేలా చూచి, "ఐతే, యిక మనం జాగుచేయటం మంచిదికాదు. పడవలెక్కండి," అంటూ వారిని హెచ్చరించాడు.

పడవలు రెండూ పెద్దతాళ్ళతో ఒడ్డున పాతివున్న కొయ్యమేకులకు బంధించబడి వున్నవి. సైనికులు వాటితాళ్ళను విప్పారు. ఒక పడవలో రాజూ, ఇద్దరు సైనికులూ, రెండవ పడవలో మిగిలిన యిద్దరు సైనికులూ ఎక్కి కూర్చున్నారు.

పడవలు రెండూ తెడ్లసహాయంతో అల్లకల్లోలంగావున్న సముద్రంలోకి నడపబడినై. ఆసరికి తుఫాను కొంత శాంతించింది. ఉరుములూ, మెరుపులూ కూడా తగ్గిపోతున్నై. వానజల్లు మాత్రం వుండివుండి పడుతోంది. సూర్యుడు అస్తమించాడు. అన్నిదిక్కులా కమ్ముకుంటున్న చీకటిని పున్నమిచంద్రుడు, సముద్రతీరాన వున్న గుబురుచెట్లల్లోకీ, సముద్రగర్భంలోకీ తరిమేస్తున్నాడు.

పడవలు సముద్రంలోకి చాలా దూరం వెళ్లినై. ఎటుపోతున్నాం, ఎక్కడికి పోతున్నాం? అన్న ఆలోచన ఎవరికీ కలగలేదు.





నరవాహనమిశ్రుడి చేతికి అందకుండా వున్నంతవరకూ, ఎక్కడికి వెళ్ళినా ఒకటే అన్నట్టు భావించారు మందరదేవుడూ, అతడి సైనికులూ.

సముద్రంలో నాలుగైదు గంటల ప్రయాణం తర్వాత వారికి దూరంగా మినుకుమినుకుమంటూ అలలమీద తేలి యాడుతున్న కాంతి కనిపించింది. ఇంత తుఫానులో, చేపలు పట్టేందుకు అంత దూరం సముద్రంలో ప్రయాణించే పల్లె వాళ్ళు ఎవరూ వుండరు. ఐతే, ఒకవేళ అవి తమను వెంబడిస్తున్న నరవాహనమిశ్రుడి నావలు కావుగదా?



ఈ సంశయం, భయం కలిగిందే తడవుగా మందరదేవుడు పడవలో లేచి నిలబడ్డాడు. మినుకుమినుకు మంటున్న దీపాల కాంతి క్రమక్రమంగా అటుకేసే వస్తోంది. బాగా పరీక్షించి చూచినమీదట అవి అంత పెద్దవికాని రెండు పడవలని మందరదేవుడు గ్రహించాడు.

"అల్లకల్లోలంగావున్న యీ సముద్రం మీద మరో యుద్ధం తప్పక పోవచ్చు. ఆ దీపాలకాంతి, మనలాగే తప్పుకు పారి పోతున్న మనదేశపు పడవలదైతే ఫరవా లేదు. అలా కానప్పుడు అవి కుండలినీ నావలే అయివుంటవి. మనలో ఎవరిదగ్గరా విల్లంబులు లేవుగదా?" అని అడిగాడు మందరదేవుడు. సైనికులలో ఒకడు వెంటనే యిలా జవాబిచ్చాడు.

"మహారాజా! మనదగ్గర ఖడ్గాలుతప్ప మరేంలేవు. మహామంత్రి మమ్ము నలుగురనూ, మీరక్షణకు పొమ్మనప్పుడు—వున్న వాళ్ళం వున్నట్టు బయలుదేరాం."

"ఫరవాలేదు," అన్నాడు మందరదేవుడు. "మరాళదేవికరుణా, మనచేతి పదునుకత్తులూ మనరక్షణకు చాలు! ఒక వేళ మరణమే తప్పనిసరైతే—ప్రాణం పోయింతరవాత యీ శరీరం సముద్ర

గర్భంలో చేపలకు ఆహారమైతేనేం? భూగర్భంలో క్రిమికీటకాలకు ఆహారమైతే నేం? ఏదైనా ఒకటే!"

మందరదేవుడి యీ మాటలు సైని కులకు ధైర్యాన్ని కలిగించినై. అంతలో, దూరంగా మినుమినుకుమంటున్న పడవలు దగ్గరదగ్గరకు రాసాగినై. బాగా కనుచూపు దూరంలోకి వచ్చేసరికి—అ పడవలలో నుంచి ఒక దీర్ఘకాయుడు ధనుస్సు చేబూని లేచి నిలబడ్డాడు.

చంద్రకాంతిలో అతడి ముఖకవళికలు సరిగా కనుపించకపోయినా, అతడు అజానుబాహువనిమాత్రం తెలుస్తూనేవుంది.

"అనుమానం రూఢి అయింది. వాళ్ళు విల్లంబులతో సర్వసన్నద్ధంగా వచ్చారు. మనం మాత్రం వాళ్ళ పడవలు అందు బాటులోకి వచ్చేవరకు, వాళ్ళ బాణాల బారిపడకుండా-లోపలకు దిగి కూర్చోవటం మంచిది," మందరదేవుడు యిలా హెచ్చ రించేలోపల రివ్వుమంటూ ఒక బాణం వచ్చి, అతడు నుంచున్న పడవకు తగి లింది. వెంటనే మందరదేవుడూ, సైని కులూ పడవ లోపలిభాగంలోకి దూకి, తలలు వంచుక్కూచున్నారు.

మనుషులు ఒకరినొకరు హెచ్చరించు కోవటమూ, బలంగా తెడ్లువేయటమూ,





దాక్కున్న మందరదేవుడికీ, సైనికులకూ వినబడుతూనేవుంది. శత్రువులు అతి వేగంగా తమను సమీపిస్తున్నారని వారు గ్రహించారు. శత్రువులు కత్తివేటుకు అందేంతదగ్గరకు వచ్చేవరకు యిలా పడవలలో వంగి కూర్చోవలసిందే, తరవాత బాహాబాహి యుద్ధంలో—ఎవరు అదృష్టవంతులో, సాహసవంతులో వాళ్లు గెలుస్తారు!

ఇలాంటి ఆలోచనలతో ప్రాణాలు వుగ్గపట్టుకు కూర్చున్న సైనికులకూ, మందరదేవుడికీ, 'జై సమరసేన్!' అన్న భీకర నినాదాలు వినిపించినై. ఈ కొత్త జయజయధ్వానం ఏమిటా అన్న ఆశ్చర్యం లోంచి బయటపడకముందే మందరదేవుడు కూర్చున్న పడవను, మరో పడవ వేగంగా తాకి, తల్లకిందులు చేసేంత ప్రమాదం సంభవించింది. తృటిలో మందరదేవుడు కత్తిదూసి లేచి నిలబడ్డాడు. 'జైమరాళీ!' అన్న అతడి సింహనాదం సముద్రంమీద మారుమోగింది. ఆక్షణంలోనే అతడి చేతనున్న కత్తి మెరుపులా ఒక శత్రువును తాకింది. వాడు చావుకేక పెట్టి సముద్రంలో పడిపోయాడు. అంతలో మందరదేవుడి నలుగురు సైనికులూ భీకరంగా అరుస్తూ ఎదిరి పడవలమీదికి లంఘించారు. కాని అంతలోనే "ఆగండి, ఆగండి! మనం శత్రు





ఇందులో ఏమైనా మోసంవున్నదా అన్న సంశయం కలిగింది మందరదేవుడికి. కాని, అంతలోనే అతడు స్థిమితపడి, "ఐతే మీ నాయకుడెవరు? అతడి పేరేమిటి?" అని ప్రశ్నించాడు.

"నాపేరు శివదత్తుడు. ఈ పడవలలో వున్నవారందరూ నా అనుచరులు!" అన్న జవాబు వచ్చింది.

"స్వాగతం, శివదత్తా! స్వాగతం," అన్నాడు మందరదేవుడు మహోత్సాహంతో, "ఇప్పటికి ఇరవైఏళ్ళ క్రితం-అంటే నేను పది సంవత్సరాల ప్రాయపువాడుగా వుండగా, మీపేరూ, కుండలినీ మహాసేనాని అయిన సమరసేనుడి పేరూ విన్నాను. మీరూ, సమరసేనుడూ ఎక్కడో భయంకర ద్వీపాల్లో చేసిన సాహసోపేత కార్యాలు, కథలలా వినేవాడిని. ఇప్పుడు స్వయంగా ఆ మహాసేనాని ముఖ్యానుచరులైన మిమ్మల్ని చూచేభాగ్యం కలిగింది. హృదయ పూర్వక స్వాగతం!"

"మీరెవరు? మరాళద్వీపరాజైన మందర దేవులు కాదుగదా?" అన్నాడు శివదత్తుడు.

"అవును. నేను రెండుగంటల కిందటి వరకూ మరాళద్వీపరాజైన మందరదేవుణ్ణే! కాని, యిప్పుడు కేవలం మందరదేవుణ్ణి!

వులం కాదు!" అన్న పెద్దకేక అందరినీ నిర్విణ్ణులనుచేసింది. అసరికే మరో యిద్దరు మందరదేవుడి సైనికుల కత్తిపోట్లకు, అరుస్తూ సముద్రంలోకి దొర్లిపోయారు.

మందరదేవుడు కత్తి పైకెత్తి "ఐతే మీరెవరు? కుండలినీ నరవాహనమిశ్రుడి సైనికులు కారా?" అంటూ కఠినంగా ప్రశ్నించాడు.

"మేము కుండలినీవాసులమే! కాని, నరవాహనమిశ్రుడు మాకు ప్రబల శత్రువు. మీరు మరాళద్వీపవాసులైతే—మనమంతా స్నేహితులం, కత్తులు దించండి!" అన్నాడు ఒక దీర్ఘకాయుడు.





నా రాజ్యం, నా కిరీటం నరవాహనమిశ్రుడి పాదాక్రాంతమైపోయినవి!" అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు జవాబేమీ యివ్వలేదు. అతడి అనుచరులతోవున్న రెండు పడవలూ, మందరదేవుడి పడవలపక్కగా వచ్చి ఆగినై. శివదత్తుడు, మందరదేవుడున్న పడవలోకి వచ్చాడు. అతడేదో చెప్పదలచి అలా వచ్చినట్టు గ్రహించిన మందరదేవుడు, తనపక్కగా అతడికి కూర్చునేందుకు చోటు చూపాడు.

శివదత్తుడు కూర్చుంటూనే, "రాజ్యంతోపాటు, రాజబిరుదంకూడా పోతుందనటంలో సత్యం లేకపోలేదు. సరే, మిమ్మల్ని మందరదేవులనే పిలుస్తాను. ఇప్పుడు తమ ప్రయాణం ఎక్కడికి? గమ్యస్థానం ఏదో నాకు చెప్పవచ్చునా?" అని అడిగాడు.

మందరదేవుడు నిట్టూర్చి, అంతలో చిరునవ్వు నవ్వాడు. "నాగమ్యస్థానం ఏదో నాకే తెలియదు. నరవాహనమిశ్రుడి చేతులలో పడకుండా తప్పించుకు పోవటమే ప్రస్తుతానికి నేను చేస్తున్నపని. వీరు నలుగురూ నా సైనికులు," అన్నాడు.

"చాలా బావుంది. అంటే యిద్దరం ఒకేరకమైన పరిస్థితులలో వున్నామన్న మాట! నేనూ అక్రూరుడి బారినుంచి తప్పించుకు పోవటమే ఆశయంగా బయలుదేరాను." అన్నాడు శివదత్తుడు.




అంతలో మందరదేవుడి సైనికులలో ఒకడు లేచి, "మహారాజా! తీరంకేసి చూడండి! ఒకేసారి అన్ని దీపాలు కదలటం ఆశ్చర్యంగాలేదా? అవన్నీ సముద్రం మీదికి బయలుదేరిన పడవలని నావుద్దేశం. శత్రువులు మనకోసమై బయలుదేరటం లేదుగదా?" అన్నాడు.

శివదత్తుడూ, మందరదేవుడూ తీరంకేసి చూచారు. సైనికుడు చెప్పినదానిలో అతిశయోక్తి ఏమీ లేదు. తీరప్రాంతమంతా



దీపాలకాంతితో ప్రకాశిస్తున్నది. గాలిలో ఎగిరే పెద్దపెద్ద మిణుగురు పురుగులా అన్నట్టు అలలతాకిడికి, దీపాలతోవున్న పడవలు పైకీ కిందికీ కదులుతున్నవి.

"మనం సూటిగా సముద్రంలోకి పోగలిగినంత దూరం పోవటం, అన్నివిధాలా శ్రేయస్కరం. అదృష్టవంతులమైతే ఏదైనా ద్వీపాన్ని చేరగలం, లేకపోతే విధివ్రాత... అంతకన్న మరేంలేదు. ఏపరిస్థితులలోనూ నరవాహనమిశ్రుడి చేతబడటం సహించరానిది," అన్నాడు శివదత్తుడు.

మందరదేవుడు అంగీకార సూచకంగా తలవూపాడు. నాలుగు పడవలూ తెడ్లసహాయంతో మహాసముద్రంమీదికి బయలుదేరాయి. వాళ్లు అనుమానించినట్టు తీరాన కనబడిన దీపపు కాంతులు, నరవాహన మిశ్రుడి నావికాదళానిదే! వాళ్లూ సముద్రం మీదికి బయలుదేరారు. తమను ఆ పడవలు వెంబడిస్తున్నవని గ్రహించిన శివదత్తుడు, తమ పడవల్లోవున్న దీపాలను ఆర్పివేయించాడు.

ఇప్పుడు పడవలు నాలుగూ, చీకట్లో నడుస్తున్నవి. ఒకదానినొకటి తాకి ప్రమాదం కలగకుండా వుండేందుకు, వాటిని నడిపేవారు తగు జాగ్రత తీసుకున్నారు. మందరదేవుడు, నక్షత్రాలతో మిలమిలలాడుతున్న ఆకాశానికేసి ఓమారు చూచి:

"శివదత్తా! కుండలినీ ద్వీపవాసులూ, మహాసేనాని సమరసేనుని అనుచరులైన మీకుకూడా, యీవిధంగా ఆ ద్వీపాన్నివదిలి ఎందుకు పారిపోవలసి వచ్చింది? నాకు చాలా ఆశ్చర్యంగావుంది!" అన్నాడు.

శివదత్తుడు ఒక్కక్షణం ఆలోచించి, "అంతా ఆ నరవాహనమిశ్రుడి కుటిల రాజనీతిప్రభావం. పోతే యిందులో సమరసేనుడి తప్పూ కొంత లేకపోలేదు. ఆ సంగతంతా చెపుతా వినండి!" అంటూ ప్రారంభించాడు. —(ఇంకావుంది)



# మహామంత్రి మనోవ్యాధి

పూర్వం గోదావరీ తీరాన ప్రతిష్ఠాన రాజ్యాన్ని త్రివిక్రమసేనుడనే రాజు పాలిస్తూండేవాడు. ఒకనాడతని ఆస్థానానికి క్షాంతిశీలుడనే భిక్షు వొకడు వచ్చి త్రివిక్రమసేనుడికి పండొకటి కానుకగా ఇచ్చాడు. రాజు ఆ పండును తన చెంత వున్న కోతి పిల్లకు తినటానికిచ్చాడు. కోతి ఆ పండును కొరికేసరికి అందులోనుంచి మేలి రత్నం ఒకటి బయటికి వచ్చింది.

అది చూసి త్రివిక్రమసేనుడు ఆశ్చర్యపడినవాడై, "నానుంచి ఏమి సహాయం కావాలి ?" అని భిక్షువు నడిగాడు.

"రాజా, నేను మంత్రసాధన చేస్తున్నాను. అది పరిపూర్ణం కావటానికి మహావీరుడి సహాయం కావాలి. ప్రపంచంలో నీకన్న మహావీరు డెవరున్నారు? అందుకని నీ సాయం కోరి వచ్చాను," అన్నాడు క్షాంతిశీలుడు.

## బేతాళ కథలు




"అ సహాయం ఎటువంటిది?" అని అడిగాడు రాజు.

"వచ్చే కృష్ణచతుర్దశినాటి రాత్రి ఈ వూరి శ్మశానంలో గల మర్రిచెట్టువద్దకు వస్తే నాకు కావలిసిన సహాయం ఏమిటో చెబుతాను," అన్నాడు భిక్షువు.

రాజు సరేనని భిక్షువును పంపేశాడు. అతను కోరినప్రకారమే కృష్ణచతుర్దశి రాత్రి త్రివిక్రమసేనుడు నల్లని బట్టలు ధరించి, కత్తి పట్టుకుని శ్మశానానికి వెళ్ళి, అక్కడ మర్రిచెట్టుకింద ఉన్న భిక్షువును చేరాడు.

"రాజా, దక్షిణంగా వెళితే అక్కడ ఒకే ఒక ఇరుగుడు చెట్టు కనిపిస్తుంది. దానిపై ఉరితీయబడిన పురుషుడి శవం కనిపిస్తుంది. నీవు పూర్తిగా మౌనంవహించి ఆ శవాన్ని చెట్టునుంచి దించి ఇక్కడికి తీసుకురావాలి," అన్నాడు భిక్షువు.

త్రివిక్రముడు అదే ప్రకారం దక్షిణాభిముఖంగా వెళ్ళి ఇరుగుడు చెట్టు చేరుకుని, దానిపై గల శవాన్ని చూశాడు. అతను చెట్టెక్కి, శవం మెడకున్న తాడు ఖడ్గంతో కోసి, శవాన్ని కింద పారేసేసరికి, దెబ్బ తగిలినట్టుగా శవం ఏడవసాగింది. రాజు ఆశ్చర్యపడుతూ చెట్టు దిగివచ్చి, తడివి చూశాడు. వెంటనే శవం నవ్వసాగింది.

ఆ శవంలో బేతాళుడున్నట్టు రాజు అర్థంచేసుకుని, "ఎందుకు నవ్వుతావు? పోదాం రా!" అన్నాడు. రాజు నోరు తెరిచి ఈ మాట అన్నదే ఆలస్యంగా శవం చివాలున వెళ్ళి మళ్ళీ చెట్టున వేలాడసాగింది.

రాజు మళ్ళీ చెట్టెక్కి శవాన్ని దించి, దాన్ని భుజానవేసుకుని, మౌనంగా శ్మశానం వేపు నడవ నారంభించాడు.

అప్పుడు శవంలో ఉన్న బేతాళుడు, "రాజా, పాపం, చాలా బరువు మోస్తున్నావు. నీకొక చిన్న కథ చెబుతాను, విను," అంటూ త్రివిక్రముడికి ఈ విధంగా చెప్పసాగాడు:

అంగదేశాన్ని యశఃకేతుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. ఆయనకు దీర్ఘదర్శి అనే మంత్రి ఉండేవాడు. యశఃకేతుడు అస్తమానమూ అంతఃపురంలోనే ఉంటూ భోగాలు మరిగి ఉండటంవల్ల రాజ్యభారమంతా దీర్ఘదర్శిమీద పడింది. దీర్ఘదర్శి రాజ్యపాలనాన్ని ఎంత నేర్పుతో సాగిస్తున్నప్పటికీ గిట్టనివాళ్లు పుకార్లు పుట్టించారు. రాజును భోగలాలసుణ్ణి చేసేసి మంత్రి తానే రాజై కూచున్నాడని నలుగురూ అనసాగారు.

ఇది విని దీర్ఘదర్శికి చాలా బాధ కలిగింది. ఆయన రాజుదగ్గిరికి పోయి, "మహారాజా, నేను తీర్థయాత్రలు చేయబోతున్నాను. ఇకనుంచీ మీ రాజ్యం మీరే స్వయంగా చూసుకోండి," అని చెప్పి బయలుదేరాడు. రాజు వెళ్లవద్దని బతిమాలి చూశాడుగాని దీర్ఘదర్శి తన ప్రయాణం మానలేదు.

ఆయన కొంతకాలం తిరిగి ఒక గ్రామం చేరాడు. అక్కడ ఆయనకు ఒక వర్తకుడితో స్నేహం కలిసింది. ఆ వర్తకుడికి సముద్రవ్యాపారం ఉంది.

"నేను ఓడలలో సరుకు వేసుకుని సముద్రంమీద సువర్ణద్వీపం వెళుతున్నాను. మీరుకూడా నాతో రావాలి,"





అని వర్తకుడు దీర్ఘదర్శిని కోరాడు. ఎన్నడూ సముద్రయానం చేసి ఉండని దీర్ఘదర్శి సరేనన్నాడు.

సువర్ణద్వీపంనుంచి తిరిగి వస్తూండగా, సముద్ర మధ్యంలో ఒకనాడు దీర్ఘదర్శికి సముద్రపుటలలమీదుగా ఒక మహావృక్షం కనిపించింది. ఆ చెట్టుమీద ఒక అద్భుత లావణ్యవతి వీణ వాయిస్తూ కూచున్నది. ఈ దృశ్యం అంతలో మళ్లీ మాయమయింది.

ఓడ కళాసులు దీర్ఘదర్శికి కలిగిన ఆశ్చర్యం గమనించి, "ఈ దృశ్యం మాకు ఈ ప్రాంతాల ప్రతిసారీ కనిపిస్తూనే వుంటుంది, బాబుగారూ!" అన్నారు.



కాలక్రమాన దీర్ఘదర్శి అంగదేశానికి తిరిగి వచ్చేశాడు. తన మంత్రిని చూడగానే రాజుకు పరమానందమయింది. మంత్రి వెళ్ళిపోయిన నాటినుండీ రాజు రాజ్యభారంతో మనశ్శాంతి ఎరగడు. మళ్ళీ పరిపాలన మంత్రి పరంచేసి తాను సుఖంగా వుండవచ్చుగదా అని ఆశపడుతూ రాజు, "అయితే, మంత్రీ, లోకంలో ఏమేం వింతలు చూశావు?" అని అడిగాడు.

"మహారాజా, మిగిలిన వింతలు వింతలే కావు. ఒక వర్తకుడి వెంట సువర్ణ ద్వీపానికి వెళ్ళి తిరిగివస్తూ, సముద్ర మధ్యాన ఒక అత్యద్భుత సౌందర్యవతిని చూశాను. ఆమె ఎవరో దేవతా స్త్రీ తప్ప మానవ స్త్రీ కాదు. నేను చూస్తుండగానే ఆమె అదృశ్యమయింది," అని దీర్ఘదర్శి చెప్పాడు.

ఈ మాట వినగానే రాజుకు ఆ స్త్రీని చూడాలని ఆత్రం కలిగింది. మంత్రి ఎంత బతిమాలుతున్నా వినక యశఃకేతుడు తన రాజ్యభారాన్ని మంత్రిమీద పెట్టి ఈసారి తాను యాత్రకై బయలుదేరాడు. ఆయన సముద్ర తీరం చేరిన కొద్ది రోజులకే సువర్ణ ద్వీపానికి ప్రయాణమైపోతున్న ఓడ దొరికింది. ఆ ఓడ గల వర్తకుడితో స్నేహం చేసి, రాజు అందులో ఎక్కి బయలుదేరాడు.



ఓడ కొంతకాలం సముద్రంమీద వెళ్లి నాక ఒకనాడు రాజుకుకూడా సముద్రం మీద ఒక మహావృక్షమూ, దానిమీద కూచుని వీణవాయించే స్త్రీ కనిపించారు. ఆ దృశ్యం చూస్తూనే రాజు ముందువెనక ఆలోచించక సముద్రంలోకి ఉరికాడు.

సముద్రం అడుగు చేరుకునేసరికి రాజుకు ఒక మహానగరం కనిపించింది. కాని, ఆ నగరంలో ఎంతసేపు తిరిగినా అయనకు అక్కడ ఒక్కప్రాణికూడా కని పించలేదు. అయినా రాజు పట్టుదలతో నగరమంతా తిరగసాగాడు. ఆఖరుకు అయన కొక విశాలభవనం కనిపించింది. రాజు ఆ భవనం ప్రవేశించి ఒక గదిలో హంసతూలికాతల్పంమీద పడుకుని ఉన్న ఒక అపురూప సౌందర్యవతిని చూశాడు.

"నువ్వెవరు? ఒంటరిగా ఇక్కడ ఎందుకున్నావు?" అని అడిగాడు రాజు.

"రాజా, నేను విద్యాధరిని. నా పేరు మృగాంకవతి. నా తండ్రికి నేనంటే ఎంతో ప్రేమ. నేను వెంట లేనిదే భోజనంచేసే వాడుకాడు. నేను ప్రతి అష్టమినాడూ, చతుర్దశినాడూ గౌరీపూజకోసం వెళ్లేదాన్ని. ఒకసారి ఇలా వెళ్ళినదాన్ని, పూజలో మునిగిపోయి రాత్రిదాకా రాలేదు. నా తండ్రి నన్ను చూడగానే మండిపడి, నన్ని





నిర్జన నగరంలో ఉండిపొమ్మని శపించాడు," అన్నదా స్త్రీ.

"జరిగినదానికి చింతించకు. నేను నిన్ను పెళ్ళాడక బతకలేను. మనిద్దరమూ ఇక్కడే ఉండిపోదాం," అన్నాడు రాజు.

"నిన్ను పెళ్ళాడటానికి నా అభ్యంతరం ఏమీలేదు. కాని ఒక్క విషయం తెలుసుకో. నా తండ్రి కోపావేశంలో శపించాడేగాని, నేను బతిమాలగా శాపవిమోచనమార్గం కూడా తెలిపాడు. అదేమిటంటే, నన్నెవరైనా పెళ్ళాడిన వారంరోజులకు నాకు శాపవిముక్తి కలుగుతుంది. నేను మా విద్యాధరలోకానికి వెళ్ళి నా తండ్రిని చేరుకుంటాను. నాకెవరైనా శాపవిముక్తి కలిగిస్తారేమోననే ఆశతోనే నేను సముద్రయానం చేసేవారికి కనిపిస్తూవచ్చాను. ఇంతకాలానికి దేవుడల్లే నువు వచ్చావు," అన్నది మృగాంకవతి.

ఆమెమీది అపారమైన ప్రేమతో రాజు, "నువు ఒక్క క్షణం నా భార్యవైనా నేను ధన్యుణ్ణే," అన్నాడు.

మృగాంకవతికికూడా రాజుమీద ఎంతో ప్రేమ కలిగింది. ఆమె అతన్ని భవనం వెలపల ఉన్న దిగుడుబావిదగ్గిరికి తీసుకుపోయి, "నే నిక్కడ ఉండే వారంరోజులలో పొరపాటునకూడా ఇందులోకి దిగవదు. దిగినట్టయితే నువు మరుక్షణం భూలోకంలో ఉంటావు. నిన్ను విడిచి నేను ఈ శూన్యనగరంలో క్షణమైనా గడపలేను," అన్నది.

సముద్రగర్భాన గల ఆ శూన్యనగరంలో యిష్టంవచ్చినట్టు విహరిస్తూ, అక్కడి వింతలన్నీ చూస్తూ మృగాంకవతితో యశఃకేతుడు వారంరోజులూ గడిపాడు.

"రాజా, ఇక నేను నా లోకానికి వెళ్ళిపోయే గడియ సమీపించింది. నువు చూపిన ప్రేమా, చేసిన మేలూ ఎల్లప్పుడూ జ్ఞాపకం ఉంచుకుంటాను. ఇక నాకు

సెలవియ్యి," అంటూ మృగాంకవతి రాజును దిగుడుబావివద్దకు తెచ్చింది.

ఆమెను విడిచిపోవటం ఎంతమాత్రం ఇష్టంలేక రాజు, "కొద్ది రోజులు నాతో కూడా వచ్చి మా నగరంలో ఉండిపో గూడదా ?" అని అడిగాడు.

"రాజా, నేను ఒకసారి భూలోకాన్ని తాకానే, నా దేవత్వం కాస్తా పోతుంది. నేను మానవ కన్యనైపోతాను. కనుక నాకు సెలవిప్పించు," అన్నది మృగాంకవతి.

రాజు ఆమెవద్ద వీడ్కోలు తీసుకునేవాడి లాగ నటిస్తూ, ఆమెను గట్టిగా పట్టుకుని, ఆమెతోసహా దిగుడుబావిలో దూకాడు. మరు క్షణం ఇద్దరూ భూలోకం చేరారు. మృగాంక వతి దేవత్వం కోలుపోయి మానవస్త్రీ అయి పోయింది. రాజు ఆమెను అంగదేశానికి తీసుకుపోయి, ఒక మంచిరోజున వైభవంగా పెళ్లిచేసుకున్నాడు. ఆ రాత్రే అంగదేశపు మంత్రి దీర్ఘదర్శి గుండెపగిలి చనిపోయాడు.

ఈ కథ చెప్పి బేతాళుడు, "రాజా, దీర్ఘ దర్శి ఎందుకు చచ్చాడు ? వెళ్ళిపోయాడను కున్న రాజు తిరిగివచ్చి తన ఏలుబడికి విఘ్నం కలిగించాడనా? తాను చూసికూడా పెళ్ళాడలేని అందగత్తెను రాజు పెళ్ళాడి మరీ తెచ్చుకున్నాడనా ? ఈ ప్రశ్నకు సమా ధానం తెలిసి చెప్పకపోయావో తలపగిలి పోతుంది," అన్నాడు.

"దీర్ఘదర్శి చావుకు నువు చెప్పినదేదీ కారణం కాదు. మామూలు భోగాలలో మునిగిఉంటేనే రాజ్యభారం తనమీద వేసి తనను అపనిందలకు గురిచేసే యశఃకేతుడు ఈ దేవతా స్త్రీ దొరికితే తిరిగి రాజ్యభారం వహిస్తాడా, తాను యావజ్జీవం అపనిందల పాలు కాక తప్పదనే విచారంతో దీర్ఘదర్శి గుండెపగిలి చచ్చాడు," అని త్రివిక్రమ సేనుడు సమాధానం చెప్పాడు.

రాజుకు మౌనభంగం కలగగానే బేతా ళుడు శవంతోసహా మాయమై చెట్టెక్కాడు.





# యుక్తిగల హెచ్చరిక

చిరపురమనే రాజ్యాన్ని చిరదాత అనే రాజు ఏలుతూ ఉండేవాడు. ఆయన కావటానికి చాలా మంచివాడే గాని, ఆయన చుట్టూ చేరినవారు పరమ దుర్మార్గులు.

ఇలా ఉండగా ప్రసంగుడనేవాడొకడు మరి ఇద్దరు స్నేహితులతో చిరపురం చేరాడు. రాజుగారిదగ్గిర ముగ్గురికీ కొలువు దొరికింది. పని ప్రారంభించారు. కాని ఎన్ని రోజులు గడిచినా వారికి ఒక జీతంగాని, భత్యంగాని ముట్టలేదు. పండగలూ పబ్బాలూ వచ్చినప్పుడు రాజుగారు తన భృత్యులందరికీ బట్టలూ, డబ్బూ పంపేవారు. వీరికి కనీసం అవి అయినా లేవు.

దివాణంలో ఏపూటకాపూట తిండి తింటూ, ఎవరేపని చెప్పినా చేస్తూవచ్చారన్నమాటేగాని, రాజుగారి కొలువులో ప్రసంగుడూ, అతని మిత్రులూ ఉన్న సంగతి ఎవరికీ తెలిసినట్టుకూడా కనబడలేదు.

"ఇలా ఈ కొలువు ఎంతకాలం చెయ్యగలం? చేతిలో ఎర్రని ఏగానీ లేకుండా మనం పెళ్ళిళ్ళేం చేసుకుంటాం? సంసారాలేం నిర్వహిస్తాం? ఏమిటి మనగతి?" అని ప్రసంగుణ్ణి స్నేహితులు అడిగారు.

"కొంచెం ఓపిక పట్టండి. రాజు దయార్ద్రహృదయుడు. ప్రతి పండుగకూ ఎంత విరివిగా దానాలు చేస్తాడో మనం చూస్తున్నాంగదా! మనం వెళ్ళి ఆయనతోనే మొరపెట్టుకుంటే మన దుర్దశ తీరిపోతుంది," అని ప్రసంగుడు సలహా ఇచ్చాడు.

ఆ ప్రకారమే వాళ్ళు రాజదర్శనంకోసం యత్నించారు. కాని భటులు వారిని రాజసౌధం దాపులకు రాకుండా తరిమికొట్టారు. రాజసభవద్దకూడా వారికి వేగతి పట్టింది.

ప్రసంగుడూ, అతని మిత్రులూ తమ విషాదగాథను ఎంతమందికో చెప్పుకున్నారు. కాని ఆవగింజంతయినా ఫలితం లేదు.

ఎస్. సోమసుందరం

ఈ విధంగా అయిదేళ్ళు గడిచినై.

లేకలేక పట్టమహిషి ఒక మగనలుసును కన్నది. యువరాజు పుట్టాడన్నారు. అర్భాటంగా ఊరంతా అలంకరించి ఉత్సవాలు జరిపించారు. డబ్బు మంచినీరులాగా ఖర్చు పెట్టి మెడమీద తలఉన్న ప్రతి పౌరుడికీ బట్టలూ, ధాన్యాలూ, పళ్ళూ, పాత్రలూ, డబ్బూ పంచారు.

శపించినట్టుగా ప్రసంగుడికిగాని, అతని మిత్రులకుగాని ఒక్క చిల్లిదమ్మిడీకూడా ముట్టలేదు.

పుట్టిన యువరాజును మూడోనాడే ఎన్నెమ్మ పొట్టనపెట్టుకుంది. మూడురోజుల పిల్లవాడు పోతే ఎవరు పెద్దగా శోకాలు పెడతారు? రాజభవనంలో రాజుగారు విచారంగా ఒకచోట కూచున్నాడు. ఎవరెవరో వచ్చి పరామర్శించి పోతున్నారు.

పరామర్శకు వచ్చే పొయ్యే జనాన్ని భటులు అడ్డగించటంలేదు. ఈ అవకాశం గమనించి, ప్రసంగుడూ, అతని మిత్రులూ రాజుగారుండే చోటికి వెళ్ళి, గుండెలు బాదుకుంటూ శోకాలు ప్రారంభించారు.

"అయ్యో, యువరాజా! నువు పెరిగి పెద్దవాడివైనాక అయినా మాకు జీతభత్యాలు ఏర్పాటు చేయిస్తావనుకుంటిమే! నీకోసం అయిదేళ్ళు కాచుకుని ఉంటిమే! ఇంతలోనే మా ఆశలు గంగలో కలిపిపోయావా! ఇంక మమ్మల్ని చూసేదెవరు? ఆదరించేదెవరు?" అంటూ వాళ్ళు గట్టిగా ఏడిచారు.

వారి మాటలు వింటుంటే రాజుకు ఆశ్చర్యం కలిగింది. వాళ్ళను దగ్గిరికి పిలిపించుకుని, "ఏమిటి మీ కథ?" అని రాజు అడిగాడు. వారు తమ దుస్థితి అంతా విన్నవించుకున్నారు. రాజుకు వారిపై జాలికలిగింది. వెంటనే వారికి జీతభత్యాలేర్పాటు చేయిస్తూ, భరణంకూడా ఇప్పించాడు.






# భాస్కర శాకల్యులు

ఒకనాడు తెల్లవారు జామున భోజరాజు ధారానగరం వీధుల వెంట బయలుదేరి శివాలయంకేసి వెళ్ళాడు. ఆలయం అరుగు మీద ఇద్దరు బ్రాహ్మలు పడుకుని నిద్ర పోతూ కనిపించారు. భోజరాజు చూస్తుండగానే వారిలో నడివయసువాడు లేచి, తన పక్కనే పడుకుని వున్న యువకుణ్ణి చూసి ఆశ్చర్యపడి తట్టి లేపుతూ, "ఎవరు, నాయనా, నువ్వు? నిద్రపోతున్నావా? మేలుకున్నావా?" అని అడిగాడు.

యువకుడు నిద్రమత్తుగా లేచికూచుని, "నమస్కారమండీ! కిందటి రాత్రి పొద్దుపోయి ఇక్కడికి వచ్చాను. మీరు పడుకుని నిద్రపోతూ కనిపించారు. నేనుకూడా ఇక్కడే పడుకుని నిద్రపోయాను. మీరు లేపితే మెలుకువ వచ్చింది," అన్నాడు.

"నీ పేరేమిటి, బాబూ? మీదే వూరు?" అని అడిగాడు పెద్ద బ్రాహ్మడు.

"నా పేరు భాస్కరుడంటారు. మాది పడమటి తీరాన ప్రభావతీ నదీ ప్రాంతం. భోజుడు గొప్ప దాత అని విని, ఆయన దర్శనం చేసుకుందామని వచ్చాను. ఒంటరిగాణ్ణి. నాకు కాస్త సాయపడండి!" అన్నాడు యువకుడు.

"దానికేం, నాయనా? నేనూ భోజుడి దర్శనంకోసమే ఇక్కడికి వచ్చాను. నన్ను శాకల్యుడంటారు. నేను కవిని. మాది దక్షిణాన ఏకశిలానగరం. నీ వాలకంచూస్తే, పాపం, చాలా కష్టాలు పడ్డట్టున్నావు." అని పెద్ద బ్రాహ్మడు అడిగాడు.

"ఏం చెప్పను, బాబుగారూ?" అంటూ భాస్కరుడు ఈ కింది శ్లోకం చదివాడు:

"క్షుత్ క్షామా శ్శిశవః శవా ఇవ భృశం
మందాశయా బాంధవాః
లిప్తా జర్జర ఘర్ఘరీ జతులవై ర్నోమాం
తథా బాధతే,

టి. రామాచార్యులు

గేహిన్యా త్రుటితాంశుకం ఘటయితుం
కృత్వా సకాకుస్మితం
కుప్యంతీ ప్రతివేశ్మలోక గృహిణీ సూచీం
యథా యాచితా."

[బిడ్డలు ఆకలితో కృశించి శవాల్లాగా ఉన్నారు. బంధువులు ఏ మాత్రం ఆదరించరు. చిలి కుండలకు మాటువేసి వాడుకుంటున్నాము. ఇవేవీ నన్ను బాధించవుగాని, నా భార్య చినిగిపోయిన బట్ట కుట్టుకునేటందుకు పక్కయింటి ఇల్లాలిని నవ్వుతూ సూది అడిగితే అవిడ కసురుకోవటం మహా బాధగా ఉంది.]

ఇతంతా ఒక స్తంభం చాటున వుండి వింటున్న భోజరాజుకు ఈ మాటలు వినగానే గుండె కరిగిపోయింది. అయన చప్పున ముందుకు వచ్చి, తన ఒంటిమీద వున్న నగలన్నీ తీసి ఇస్తూ, "భాస్కర కవీ, నువు వెంటనే బయలుదేరి మీ ఊరు వెళ్ళి నీ భార్యా బిడ్డల సంగతి చూడు!" అన్నాడు.

భోజరాజు ఔదార్యానికి పరవశుడై శాకల్యుడు వెంటనే ఈవిధంగా ఆయనను కీర్తించాడు:

"అభ్యుద్ధృతా వసుమతీ, దళితోరి వర్గః
క్రోడీకృతా బలవతా బలిరాజ లక్ష్మీః.
ఏకత్ర జన్మని కృతం యదనేన యూనా
జన్మత్రయే త దకరోత్ పురుషః పురాణః."

[భగవంతుడు ఒక జన్మలో (వరాహంగా) భూమిని ఉద్ధరించాడు, ఇంకొక జన్మలో (పరశురాముడుగా) తన శత్రు వర్గాన్ని నాశనం చేశాడు, మరొక జన్మలో (వామనుడుగా) బలవంతుల రాజలక్ష్మిని (లేక, బలిచక్రవర్తి యొక్క రాజలక్ష్మిని) కాజేశాడు. ఈవిధంగా భగవంతుడు మూడు జన్మలలో చేసిన పనులను (భోజరాజు) ఒకే జన్మలో, అందులోనూ యౌవనంలోనే సాధించాడు]

ఇది విని సంతోషించి భోజరాజు శాకల్య కవికి మూడు లక్షలు బహూకరించాడు.



నీతికథ

# సౌఖ్యం – అదృష్టం

ఒకనాడు సౌఖ్యమూ, అదృష్టమూ కలిసి ప్రయాణంచేస్తూ ఒక బస్తీకి వచ్చారు. వారి కక్కడ ఒక పేదవాడు, వీధివెంట చీపురు కట్టలు అమ్ముతూ, కనిపించాడు.

సౌఖ్యం వాణ్ణి చూసి జాలిపడి, "వీడికి నేను ఉపకారం చెయ్య దలిచాను," అంటూ వాడి దగ్గిర ఉన్న చీపురుకట్టలన్నీ రెట్టింపు ధరకు కొన్నది.



మరికొన్ని రోజుల అనంతరం వారిద్దరూ మళ్ళీ అబస్తీకే వచ్చారు. వారికా అభాగ్యుడు చీపురుకట్టలు వీధివెంట అమ్ముతూ కనిపించాడు.

తాను చేసిన ఉపకారం ఫలించ నందుకు చింతిస్తూ సౌఖ్యం వాడి దగ్గిరఉన్న చీపురుకట్టలను ఈసారి నాలుగింతలు ధరకు కొన్నది.

మళ్ళీ కొంతకాలం గడిచింది. అక్కాచెల్లెళ్లు ఇంకోసారి అవూరుకు వచ్చారు. ఆ పేదవాడింకా చీపురు కట్టలు అమ్ముకుంటూనే ఉన్నాడు.

"ఛీ! ఈ నిర్భాగ్యుడికి ఎంతచేసీ లాభంలేదు అన్నది!" సౌఖ్యం.

"ఈసారి నన్ను సహాయపడనీ!" అన్నది అదృష్టం. ఆమె వాడి చీపురుకట్టలన్నీ మామూలు ధరకే కొన్నది. తరవాత అక్కచెల్లెళ్ళు వెళ్ళిపోయారు.

కొంతకాలం గడిచాక వాళ్లు మరొకమారు ఆ వూరికి రావటం జరిగింది. వారికెదురుగా ఒక ధాన్యంబస్తాల బండీ వస్తున్నది. బండీమీద చీపురుకట్టలు అమ్మినవాడున్నాడు.

"చూశావా? నా సహాయంతో వీడిప్పుడు వ్యాపారి అయినాడు. నువు వాడికి చీపురుకట్ట లమ్మటంలో సుఖం చూపావు. నేను వాడికి వ్యాపారంలో ఆసక్తి కలిగించాను," అన్నది అదృష్టం.



# ప్రతిఫలం

సూర్యాపురంలో దౌలత్‌రాం అనే ధనవంతుడుండేవాడు. అతనికొక కొడుకుండేవాడు. వారివద్ద ధనసంచులు మూలుగుతూ ఉండేవి. తండ్రి కొడుకులు లక్ష్మిని బందిఖానాలో పెట్టి, పారిపోకుండా వెయ్యి కళ్ళతో కాపాడుతూండేవాళ్ళు. తమదగ్గిర డబ్బున్నట్టు ఎవరికీ తెలియకుండా ఉండగలందులకు వాళ్ళు తిండికికూడా సరిగా లేనివాళ్లలాగా జీవిస్తూ ఉండేవాళ్ళు.

ఇలా ఉండగా ఆ ప్రాంతాల బందిపోటు భయం జాస్తి అయింది. చుట్టుపక్కల చాలా గ్రామాలమీద బందిపోటు దొంగలు పడి దోచేశారు, అనేక మంది ధనికులను చంపారు, వారి ఇళ్లు తగలబెట్టేశారు.

వాళ్లు ఉన్నట్టుండి సూర్యాపురంమీద కూడా ఎప్పుడో పడితీరుతారు. అందుచేత తండ్రి కొడుకులు ఒక ఉపాయం ఆలోచించారు.

"రాత్రిపూట మనం డబ్బంతా శ్మశానానికి పట్టుకుపోయి, గుర్తుగా ఒకచోట పాతిపెట్టి తెల్లవారేలోపుగా ఇంటికి వచ్చేద్దాం," అన్నాడు తండ్రి. సరేనన్నాడు కొడుకు.

ఆ రాత్రే వాళ్లిద్దరూ ధనంమూటలూ, ఒక పలుగూ, పారా తీసుకుని అంధకారంలో శ్మశానానికి బయలుదేరారు.

ఆ వూళ్ళోనే ఒక బిచ్చగాడున్నాడు. వాడికి ఇల్లూ, వాకిలీ లేదు. కట్టుకోవటానికి ఒక చింకిపాత మాత్రం ఉండేది. ఏళ్ళతరబడి ఎన్నడూ కడుపునిండా తిండి లేక చిక్కిశల్యమై ఉన్నాడు. వాడు పగల్లా పనికోసం తిరిగేవాడు. చీకటిపడగానే మాదాకబళం ఎత్తేవాడు. దొరికినంత తిని ఏ వీధిఅరుగుమీదనో పడుకునేవాడు.

ఈ రాత్రి ఈ బిచ్చగాడికి తిండి దొరకలేదు. నిద్రపట్టక మేలుకుని పడుకుని ఉండగా వీధివెంట పోతూ దౌలత్‌రాం,

---

జి. హరినారాయణ

---




అతని కొడుకూ కనిపించారు. వాళ్ళ భుజాలమీద పెద్ద పెద్ద మూటలున్నాయి. ఒకరిచేతిలో పారా, ఇంకొకరి చేతిలో పలుగూ ఉన్నాయి. వాళ్ళు కొంచెమైనా చప్పుడు చెయ్యకుండా మునివేళ్ళమీద నడుస్తూపోవటం చూసి ధరిద్రుడికి అనుమానం తగిలింది. వాడు లేచి వాళ్లకు కొంచెం వెనకగా రాసాగాడు.

తండ్రి కొడుకులు శ్మశానంలో ఒక మూలను మూటలు దింపారు. దౌలత్‌రాం పలుగుతో గొయ్యి తవ్వనారంభించాడు. బిచ్చగాడు ఒక చెట్టుచాటుకు పాకివచ్చి జరిగేదంతా గమనించసాగాడు.

ఇంతలో దౌలత్‌రాం తల ఎత్తి చూసి, "ఆ చెట్టుపక్కగా నేలమీద ఏదో తల లాగా కనిపిస్తుందేమిటి?" అన్నాడు.

కొడుకు చెట్టుదగ్గిరికి వెళ్లేలోపల బిచ్చగాడు కళ్ళు మూసి శరీరమంతా కొయ్యలాగా బిగదీసుకుని, పడుకున్నాడు. వాడు అచ్చగా శవంలాగే ఉన్నాడు.

దౌలత్‌రాం కొడుకు, అది శవమే అని రూఢిచేసుకుందామని జేబులోనుంచి చిన్న కత్తి తీసి ఆ బిచ్చగాడి చెవి కోసేశాడు. బాధ పుట్టినప్పటికీ వాడు ఓర్చుకున్నాడు.

కొడుకు తండ్రిదగ్గిరికి తిరిగి వెళ్ళి, "ఎవడో దిక్కులేనివాడి శవం. ఇదుగో చెవి కోసుకువచ్చాను," అన్నాడు.

"ఏదీ? నన్నుకూడా చూడనీ. ఆ చాకు ఇలా తే," అంటూ దౌలత్‌రాంకూడా బిచ్చగాడిదగ్గిరికి వెళ్ళాడు. ఆయనకుకూడా ఆ చెట్టుపక్కన ఉన్నది శవమే అనిపించింది. ఎందుకైనా మంచిదని ఆయన చాకుతో బిచ్చగాడి ముక్కు కోశాడు. బిచ్చగాడు చలించలేదు.

తరవాత తండ్రి కొడుకులు గొయ్యి తవ్వి, ధనంసంచులు అందులో పూడ్చి, పారతో గొయ్యి పూడ్చేసి చదునుచేసి తమ దారిన తాము ఇంటికి వెళ్లిపోయారు.

వాళ్లు వెళ్ళగానే బిచ్చగాడు లేచి తన చేతులతో మట్టి తీసి, సంచులు పైకి లాగి, మళ్ళీ గోతిని పూడ్చి సంచులు తీసుకుని వెళ్ళిపోయాడు.

వాడు ముందుగా ఒక పూరిపాకా అద్దెకు తీసుకుని, అందులో డబ్బు దాచాడు. తన ముక్కూ, చెవీ నయమయాక, మంచి బట్టలు కుట్టించుకున్నాడు. వాడు పేరు మార్చుకుని నడివీధిలో ఒక పెద్దమేడ కొని అందులో సుఖంగా ఉన్నాడు.

కొద్దికాలానికి బందిపోటు బెడద పోయింది. అనేక గ్రామాల జనం ఏకమై బందిపోటును ఎదిరించి, కొందరు దొంగలను చంపారు, మరికొందరిని పట్టుకుని రాజుగారికి వప్పగించారు.

"ఇక భయంలేదు. మన సొమ్ము మనం తెచ్చుకుందాం!" అన్నాడు దౌలత్‌రాం కొడుకుతో. రాత్రి కాగానే ఇద్దరూ కలిసి శ్మశానానికి బయలుదేరారు. గుర్తులప్రకారం పాతిపెట్టిన చోట తవ్వారు. కాని డబ్బు లేదు. తెల్లవారేదాకా ఆశకొద్దీ చుట్టుపక్కల అంతా తవ్వారు. డబ్బు ఎవరో కాజేసినట్టు రూఢి అయింది. ఇద్దరూ హతాశులై ఇంటికి తిరిగివచ్చారు.



"మనం శవం అనుకున్నది బతికిన మనిషి అయిఉండాలి. మనం వెళ్ళగానే వాడే డబ్బు పట్టుకుపోయి ఉంటాడు. ఆ డబ్బు రహస్యం మరొక పురుగుకు తెలిసే అవకాశం లేదు," అన్నాడు దౌలత్‌రాం.

"అదే జరిగి ఉంటే ఎక్కడో ఒక ముక్కూ, చెవీ లేనివాడు లక్షాధికారిగా జీవిస్తూ ఉంటాడు," అన్నాడు కొడుకు.

కొడుకు ఈ మాట అనగానే తండ్రికొక ఆలోచన వచ్చింది. "నువు మన ఊరంతా తిరిగి ఊళ్ళో కొత్త ధనికులెవరన్నా ఉన్నారేమో ఆరాతియ్యి. ఉంటే ఆ మనిషిని చూసిరా!" అన్నాడు దౌలత్‌రాం.

ఎంతో శ్రమపడి అచూకీ తీసిన మీదట నడి బజారులో ఒక ధనికుడు కొత్తగా ఒక మేడ కొన్నట్టూ, అతనికి ఒక ముక్కూ, చెవీ లేనట్టూ బయటపడింది.

వెంటనే దౌలత్‌రాం కొడుకుతో సహా రాజుగారి దగ్గిరికి వెళ్ళి ఫలాని మనిషి రహస్యంగా దాచుకున్న తన సొత్తంతా అపహరించినట్టు ఫిర్యాదు చేశాడు.

రాజుగారు ముద్దాయినీ, ఫిర్యాదీలను పిలిపించాడు. దౌలత్‌రాం రాజుగారితో, "ప్రభూ, మేము బందిపోటుదొంగలకు భయపడి మా సొమ్మంతా శ్మశానంలో ఒక చోట దాచుకుంటే ఈ మనిషి చాటున ఉండి చూసి సొమ్ము కాజేసి లక్షాధికారి అయి జీవిస్తున్నాడు. మాకు న్యాయం చెయ్యాలి!" అన్నాడు.

"నువు వీళ్ళు సొమ్ము దాచగా చూసి, దానిని తవ్వి తీసుకున్న మాట నిజమేనా?" అని ముద్దాయిని అడిగాడు రాజు.

"చిత్తం, ప్రభూ! నిజమే!" అన్నాడు ముద్దాయి.

"అయితే దాన్ని వారికి తిరిగి ఇచ్చి వెయ్యి," అన్నాడు రాజు.

"ప్రభూ, నేను చేసినది దొంగతనం కాదు. వీరు పాతిపెట్టిన సొమ్ము నేను తీసుకున్న మాట నిజమే. ఆ సొమ్ముకు ప్రతిఫలంగా వారు నా ముక్కూ, చెవీ కోసి పుచ్చుకున్నారు. నా ముక్కూ, చెవీ నాకు ఇచ్చేసినట్టయితే వారి సొత్తు నేను వారికి వప్పగిస్తాను," అన్నాడు ముద్దాయి, తన ముక్కూ, చెవీ చూపిస్తూ.

రాజుగారు జరిగినదంతా ఆసాంతం తెలుసుకుని, "ముద్దాయి తప్పేమీ లేదు. అతని ముక్కూ, చెవీ అతనికి ఇచ్చేసి మీ సొత్తు మీరు తీసుకుపొండి. లేనిపక్షంలో ఆ ధనం అతనికే చెందుతుంది. దాని కతను ఎవరూ ఇవ్వలేని ప్రతిఫలం ఇచ్చాడు!" అని తీర్పు చెప్పాడు.






# నిజమైన వారసుడు

పూర్వం పునీతుడనే పండితు డుండేవాడు. ఆయనకు లేకలేక సుదాముడనే కొడుకు కలిగాడు. వాడు ఒట్టి తెలివితక్కువవాడు. చదువు ఏ మాత్ర మూ అబ్బకపోయినా అవలక్షణాలన్నీ పట్టుపడ్డాయి. పునీతుడికి ఇల్లూ, వాకిలీ, డబ్బూ ఉంది. కాని సుదాముడు, తండ్రి బతికివుండగానే, డబ్బంతా అల్లరి చిల్లరగా ఖర్చుచేయసాగాడు.

పెళ్లిచేస్తే పిల్లలు పుట్టుకొచ్చినాకనైనా సుదాముడు ఇంటిపట్టున ఉండి బాగుపడతాడేమోనని తండ్రి అతనికి ఎంతో చక్కని పిల్లను తెచ్చి వివాహంచేశాడు. సుదాముడికి పిల్లలుకూడా పుట్టారు. కాని మనిషి అవగింజంత అయినా మారలేదు.

కొడుకు బాగుపడే గీత లేదనే విచారంతో మంచంపట్టి, కొంతకాలానికి పునీతుడు మరణించాడు. తండ్రి అడ్డం తొలగగానే సుదాముడు మరింత విజృంభించి మిగిలిన ధనమంతా కర్పూరంలాగా మాయంచేశాడు. అతనికి ఇల్లూ, దొడ్డీ మిగిలాయి. సుదాముడు వాటిని ఒక కోమటిశెట్టికి విక్రయించి, ఇక ఆ వూళ్ళో ఉండటానికి మొహం చెల్లక, భార్యా బిడ్డలతో ఎటో వెళ్ళిపోయాడు.

ఎక్కడికి వెళ్లినా సుదాముణ్ణి దురదృష్టం వెంటాడింది. చివరకు భిక్షాటన చేసి జీవిస్తూ సుదాముడు దిక్కులేనిచోట చనిపోయాడు.

సుదాముడి ఇల్లు కొన్న శెట్టికికూడా కాలం కలిసిరాలేదు. వ్యాపారంలో చాలా నష్టం వచ్చింది. ఆఖరు రోజులలో ఆయనకు ఈ ఇల్లూ, దొడ్డీ మాత్రమే మిగిలాయి. కాలక్రమాన ఆ శెట్టికూడా మరణించాడు. ఇల్లూ, దొడ్డీ ఆయన కుమారుడైన రామిశెట్టి పరమయాయి.

రామిశెట్టి బుద్ధిమంతుడు. తండ్రి తనకేమీ రొక్కమివ్వకపోయినా సాటి

శింగంపల్లి అప్పారావు






కోమట్లలో నిజాయితీ గలవాడని పేరు తెచ్చుకుని, వారు నలుగురూ సహాయం చెయ్యగా ఊళ్లోనే ఒక చిన్న చిల్లర దుకాణం పెట్టుకున్నాడు. ఇంటిని ఆనుకుని నిక్షేపమంటి పెరడున్నది. అది వృథాగా పోవటం దేనికి? తవ్వి పాదులు వేస్తే కూరగాయలైనా కాస్తాయని రామిశెట్టికి తోచింది.

అందుచేత ఒకనాటి సాయంకాలం అతను దుకాణం మూసి ఇంటికి వచ్చి, పలుగు తీసుకుని పెరడంతా తవ్వసాగాడు. ఒక మూల తవ్వుతుండగా పలుగు కేదో ఖంగున తగిలింది. అవి ఎవరో దాచిన లంకె బిందెలు! ఎంతో ఆశతో రామిశెట్టి ఆ బిందెలను ఎత్తుకుని లోపలికి వెళ్ళి భార్యకు చూపించాడు. ఇద్దరూ ఆత్రంగా వాటికి కట్టిన వాసెనలు ఊడదీసి చూసి ఒక్కసారిగా హతాశులైపోయారు. వాటి నిండా చచ్చిన తేళ్లూ, మండ్రగబ్బలూ కనిపించాయి.

"ఈ సొత్తు మనది కాదు! దీనికి వారసు లెవరో వేరే ఉన్నారు," అన్నాడు రామిశెట్టి భార్యతో.

"ఇలాటి సొత్తు ఎవరిక్కావాలి? అవతల పారేద్దాం!" అన్నది అతని భార్య.

"పిచ్చిదానా అది బంగారమేనే! దానికి అయినవాడు వచ్చేదాకా అది బంగారం లాగా కనబడదు," అన్నాడు రామిశెట్టి.

శెట్టిభార్య నమ్మలేదు. "బంగారమైతే ఒకళ్ళకి కాకపోతే ఒకళ్ళకయినా బంగారం లాగా కనబడదా? అందరికీ తేళ్ళలాగా కనిపిస్తే అప్పుడన్నా పారేస్తావా?" అన్నదావిడ భర్తతో.

ఇది శెట్టికి మంచి ఉపాయంగానే తోచింది. అయన నాలుగు తేళ్లకు దారాలు కట్టి తన దుకాణంలో నాలుగుమూలలా వేళ్ళాడగట్టాడు. దుకాణానికి వచ్చిన వారందరికీ అవి తేళ్ళలాగే కనపడేవి.



"ఏం, శెట్టి? దుకాణంలో చచ్చిన తేళ్ళు వేళ్ళాడగట్టావేమయ్యా?" అని అందరూ అడిగేవారు.

"బీదవాణ్ణి, మరేం చెయ్యమన్నారు? తేలు మహాలక్ష్మి అని ఎవరో అంటే పోనీ గదా అని కట్టా!" అనేవాడు శెట్టి.

"లక్ష్మి ఎత్తుకుంటుందేమో? ఎవరు చూశారు?" అని వాళ్ళు వెళ్ళిపోయేవారు.

కొంతకాలమయాక ఆ దుకాణానికి సుదా ముడి అఖరు కొడుకు వచ్చి కొన్ని స్వయం పాకం వస్తువులిమ్మని అడిగాడు. రామిశెట్టి వాటిని కట్టి ఇస్తుండగా ఆ యువకుడు తల ఎత్తి నాలుగు మూలలూ చూసి, "శెట్టిగారు చాలా ధనికుల్లాగుంది! విలువైన బంగారు నగలను దారాలు పెట్టి వేల గట్టారు! బంగారం అంత ఎక్కువగా ఉంటే నాబోటి పేదవాణ్ణి పిలిచి దానం ఇచ్చెయ్యగూడదూ?" అన్నాడు నవ్వుతూ.

రామిశెట్టి ఉలిక్కిపడ్డాడు. "అంత కంటేనా, బాబూ! ఇంటినిండా బంగారం మూలుగుతోంది. వచ్చి దానంపట్టండి!" అంటూ ఆయన లేచాడు.

మొదట బ్రాహ్మణయువకుడు శెట్టి మాటలు నమ్మలేదు. కాని శెట్టి, "నవ్వు లాట కాదు, బాబూ! రండి, దానం పట్టండి!" అన్నాడు మళ్ళీ.



బ్రాహ్మడు శెట్టివెంట వెళ్ళాడు. శెట్టి లంకెబిందెలు తెచ్చి బ్రాహ్మడిముందు పెట్టి, "మంత్రాలు చెప్పి, దానం పుచ్చుకోండి. నాకు ఈ జన్మకు లేకపోతే ముందు జన్మకైనా కలుగుతుందేమో!" అన్నాడు.

బ్రాహ్మడు దానం పుచ్చుకుని రెండు బిందెలూ తెరిచి చూశాడు. రెంటినిండా బంగారం! శెట్టి ఇంత బంగారాన్ని తన కెందుకు దానం ఇచ్చేశాడో ఆ యువకుడికి అర్థంకాలేదు. శెట్టి ఇల్లు చాలా బీదగా ఉంది.

"నువు కొంచెమైనా ఉంచుకోక అంతా నాకెందు కిచ్చావు?" అని అన్నాడతను.

"ఉంచుకోవాలంటే మాత్రం ప్రాప్తం ఉండవద్దా, బాబూ?" అంటూ శెట్టి జరిగిన సంగతంతా చెప్పాడు.

అంతా విని బ్రాహ్మణ కుర్రవాడు ఆశ్చర్యంగా, "అయితే ఈ ఇల్లు మాదేనన్న మాట! మా తాతగారి దీ ఊరే. మా నాన్నగారు అంతా అమ్ముకుని మరొక చోటికి వెళ్ళిపోయారు. నేను చిన్నతనంనుంచీ దారిద్ర్యం తప్ప ఎరగను. ఏ అదృష్టదేవతో నన్ను మీదగ్గిరికి నెట్టుకొచ్చింది. అయితే నాది ఒక్క కోరిక. ఆ కోరిక తీర్చేపక్షంలో నే నీ దానం పుచ్చుకుంటాను," అన్నాడు.

"చెప్పండి. చేతనైతే చేస్తాను," అన్నాడు రామిశెట్టి.

"ఇందులో ఒక బిందె నానుంచి మీరు దానం పుచ్చుకోవాలి!" అన్నాడు బ్రాహ్మణ యువకుడు.

కోమటికి పరమానందమయింది. ఒక బిందెను రామిశెట్టికి దానం ఇచ్చి బ్రాహ్మణ యువకుడు రెండో బిందె తీసుకుని వెళ్ళిపోయాడు.

శెట్టీ, భార్యా ఆత్రంగా, తాము దానం పట్టిన బిందెను నేలమీద కుమ్మరించారు. బంగారు నగలు నేలమీద ధగధగా మెరుస్తూ కనపడ్డాయి.





# కపట దానం

పూర్వం చంద్రనగరంలో ఒక కరణం ఉండేవాడు. ఆయనకు అంతులేని పొలం, కట్టుకుపోయినన్ని పశువులూ ఉండేవి. అయినా పరమలోభి. కానీ ఖర్చుచేయాలంటే గిజగిజా తన్నుకునేవాడు.

ఒకరోజు కరణం ఆవులలో ఒకదానికి జబ్బుచేసి తీవ్రంగా పరిణమించింది. దాని పొట్ట ఉబ్బిపోయి శ్వాసకూడా సరిగా పీల్చలేకుండా ఉంది. కరణంగారికి ఆవు పోతున్నదన్న విచారంతోబాటు, దాన్ని ఊరిబయటికి లాగించటానికి రెండు రూపాయల ఖర్చు అవుతుందే అన్న విచారం కూడా పట్టుకుంది.

కరణంగారు ఈ విషయం భార్యతో అన్నాడు. ఆవిడకూడా లోభంలో భర్తకు తీసిపోయేదేమీ కాదు. "చచ్చిపొయ్యే ఆవును ఎట్లాగూ ఆపలేం. పైఖర్చు తగలకుండా చూడండి," అన్నదావిడ భర్తతో.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను," అన్నాడు కరణం.

కరణంగారు వీధిఅరుగుమీద కూచుని ఉండగా అటుకేసి ఒక యాయవారం బ్రాహ్మడు వచ్చాడు. ఆ బ్రాహ్మడు ఆ వూరికి కొత్త. ఆయనను చూడగానే కరణంగారికి మంచి ఆలోచన తట్టింది.

"ఏమయ్యా, బ్రాహ్మడా? సమయానికి కనిపించావు. నీకోసమే కబురుచేద్దామనుకుంటున్నాను," అన్నాడు కరణం.

"చిత్తం, చిత్తం! ఏమిటి విశేషం?" అన్నాడు యాయవార బ్రాహ్మడు.

"వెనక నాకు పెద్ద జబ్బుచేస్తే గోదానం చెయ్యమన్నారు. అది ఈనాటిదాకా పడింది కాదు. ఇవాళ నువ్వు కనిపించావు. నువ్వయినా పిల్లాపీచు కలవాడివి. గోవును దానం చేస్తాను. హాయిగా ఇంటికి పట్టుకుపో!" అన్నాడు కరణం.

పి. వి. భావనార్యులు

బ్రాహ్మడికి పరమానందమయింది. ఆయనది పిల్లాపీచూ గల సంసారం. పాలకు చాలా ఇబ్బందిపడిపోతున్నాడు. ఈ కరణంగారు పరమలోభి అని విని ఈయనను ఎన్నడూ, ఏమీ యాచించలేదు. కాని తీరాచూస్తే ఈయన మంచి దాన పరుడులాగే కనిపించాడు.

"మీరిస్తానంటే నేను కాదంటానా? కాని ఇవాళ అష్టమి, బాగాలేదు. ఎల్లుండి దశమినాడు దానం పడతాను," అన్నాడు బ్రాహ్మడు వినయంగా.

"అలా కాదు. ఇవాళే, ఇప్పుడే పుచ్చుకోవాలి. నాకు పనులు నానబెట్టటం బొత్తిగా పనికిరాదు. గోదానానికికూడా తిథి వార నక్షత్రాలేమిటి?" అన్నాడు కరణం.

కాదుకూడదంటే, కరణం ఆవును కాస్తా మరొకరి చేతిలో పెట్టేసిపోతాడని యాయవార బ్రాహ్మడు మంచిరోజు కాకపోయినా గోదానం పుచ్చుకోవటానికి సిద్ధమయాడు.

ఇద్దరూ బయలుదేరి కరణంగారి పశువులశాలకు వెళ్లారు. చావు బతుకులమధ్య ఉన్న ఆవును చూపించి కరణంగారు, "అదుగో మీ అవు. తీసుకుపో," అన్నాడు.

బ్రాహ్మడికి కరణం దుర్బుద్ధి అర్థమయింది. ఆ అవుమీద ఆశ వదులుకున్నాకనే కరణంగారు దానం ఇవ్వ



నిశ్చయించాడు. లేకపోతే కానీకి గడ్డితినే కరణంగారేమిటి? గోదానం చెయ్యట మేమిటి? గోదానం వెంటనే పుచ్చుకోమని తొందరపెట్టటంకూడా ఇందుకే!

"దానికి ఒంట్లో బాగున్నట్టు లేదే?" అన్నాడు బ్రాహ్మడు.

"అది ఆరోగ్యంగా ఉందని నేనన్నానా? నేను దానమిద్దామనుకున్నది ఇదే. జబ్బుగా ఉన్నా, చచ్చినా అది నీదే! నీకు దానం ఇచ్చేశాను. నాకిక దాని పూచీ ఏమీ లేదు," అన్నాడు కరణంగారు.

"మీ చిత్తం, నా భాగ్యం! ఎవరి అదృష్టాని కెవరు కర్తలు? నా ఆవును నేను పట్టుకుపోతాను. ఒక్కక్షణం ఆగండి," అంటూ యాయవారబ్రాహ్మడు దొడ్లోకి వెళ్ళి ఏదో ఆకుకోసం వెతకసాగాడు.

ఈ బ్రాహ్మడి తండ్రి గొప్ప పశువైద్యుడు. ఇతనికికూడా కొన్ని మూలికలు తెలుసు. అతను కొద్దిసేపట్లోనే ఒక మొక్కను పట్టి, దాని ఆకులు కోసి తెచ్చి, వాటి రసం ఆవు ముక్కుల్లో పిండాడు.

వెంటనే ఆవు పెద్దగా తుమ్మింది. దాని గొంతులోనుంచి కఫం తాటికాయ ప్రమాణంలో తెగి పడింది.

ఆవు లేచి నిలుచున్నది. కరణంగారి పైప్రాణం పైనే పోయినంత పనయింది. ఒక రూపాయి డబ్బులు ఖర్చయినా ఆమాత్రం వైద్యం చేయించుకుంటే తన ఆవు తనకే వుండేదిగదా అని విచారించాడు.

బ్రాహ్మడు సంతోషంతో ఆవు మెడనున్న పలుపు చేతపట్టుకుని, కరణంగారి దగ్గిర సెలవు పుచ్చుకుని, దానిని ఇంటికి తోలుకుపోయాడు.

"అయ్యో, నిక్షేపమంటి ఆవును నిష్కారణంగా యాయవారబ్రాహ్మడిపాలు చేశామే!" అన్నాడు కరణంగారు తన భార్యతో. ఇద్దరూ కలిసి చాలాసేపు కంటికీ మంటికీ ఏకధారగా ఏడిచారు.



హా స్య క థ

# ముఖం చూసిన వేళ

ఒక రాజుగారు అతికోపి, అహంకారం కలవాడు. ముందువెనకలు ఆలోచించ కుండానే ఎంతపని అయినా చేసేవాడు. ఆయనను చూసి ప్రజలు గడగడా వణికేవారు.

ఒకనాటి ఉదయం రాజుగారికి మంగలి గడ్డం చేసేటప్పుడు ప్రమాద వశాత్తూ చిన్నగాటు పడింది. మరి కాస్సేపటికల్లా రాజుగారి అశ్వశాల అంటు కున్నది. రాజుగారి ఉత్తమాశ్వం చచ్చిపోయింది. జాముపొద్దెక్కేలోపుగా ఇంకొక దుర్వార్త వచ్చింది. రాజుగారి పడవలలో ఒకటి సముద్రంలో మునిగి పోయిందట.

"పొద్దునే లేచి ఎవరి ముఖం చూశానోగాని మధ్యాన్నం కాకముందే నాకు మూడు అరిష్టాలు జరిగాయి!" అనుకున్నాడు రాజు.

ఆలోచించగా, ఆ ఉదయం తాను మొదట చూసిన ముఖం చాకలివాడి దని రాజుకు గుర్తుకొచ్చింది. తెల్లవారుజామున చీకటి వుండగానే రాజుగారు షికారుకు పోతుంటే చాకలి ఎదురై, "దణ్ణం, దొరా!" అన్నాడు.

"ఆ దుర్మార్గుడి ముఖం చూడబట్టే ఇన్ని దుస్సంఘటనలు జరిగాయి. ఆ చాకలిని పట్టితీసుకువచ్చి ఉరితీయించండి!" అని రాజు భటుల కాజ్ఞా పించాడు.

చాకలిని పట్టుకొచ్చి విచారించి, కారణంచెప్పి, శిక్ష విధించారు. వాణ్ణి ఉరితీయటం చూడటానికి ఊరంతా పోగయింది.

ఆఖరుక్షణంలో చాకలి రాజుగారికి ఒక విజ్ఞాపన చేసుకుంటానన్నాడు.

"ఏమిటి నీ విజ్ఞాపన?" అన్నాడు రాజు.

"తెల్లారిలేచి తమరు నా ముఖం చూశారు. తమరికి గడ్డం గాటయింది, గుర్రం చచ్చింది, పడవ మునిగింది. మరి తెల్లారిలేచి నేను తమ ముఖమే చూశాను! నాగతి చూడండి! నా ప్రాణమే పోతున్నది!" అన్నాడు చాకలివాడు.

రాజుగారికి పదిమందిలోనూ చచ్చే అవమానమయింది. ఆయన చాకలి వాడి శిక్ష రద్దుచేసేశాడు. అదిమొదలు రాజు తొందరపడి ఏ పనీ చేసే వాడుగాడు.

# లంచం

బగ్దాద్ ఖలీఫా అయిన హారున్ అల్‌రషీద్‌కు తరుచు నిద్రపట్టేదికాదు. ఒక రాత్రి ఆయనకు నిద్రపట్టక వినోదం ఏదైన ఏర్పాటుచేయమని తన అనుచరులను కోరాడు. ఇబన్ ఆల్ కరీబీ అనేవాడు చక్కని హాస్యకథలు చెప్పగలడని మస్రూర్ అన్నాడు. ఖలీఫా ఇబన్ చెప్పే హాస్యకథలు ఎన్నడూ వినినవాడు కాక పోవటంచేత ఇబన్‌ను పిలుచుకు రమ్మన్నాడు.

మస్రూర్ ఇబన్‌పద్దకు వెళ్ళి, "నీకు ఖలీఫా దర్శనం ఇప్పిస్తాను. కాని ఆయన నీకిచ్చేదానిలో నాకు ముక్కాలువంతు ఇచ్చుకోవలిసి ఉంటుంది," అన్నాడు. ఖలీఫా దర్శనం దొరికితే చాలునని ఇబన్ సమ్మతించాడు.

ఖలీఫా, ఇబన్‌ను చూస్తూనే, "నన్ను నవ్వించే కథలు చెప్పచూస్తాం. లేకపోతే తాట వొలిపించేస్తాను!" అన్నాడు. అసలే కంగారుగా ఉన్న ఇబన్‌కు ఈమాట వినగానే మతి పోయినట్టయింది. అతనికి ఒక్క హాస్య కథా జ్ఞాపకం రాలేదు. అర్థంలేని కథ లేవో చెప్పసాగాడు. దానితో ఖలీఫాకు మండిపోయి, "ఈ దుర్మార్గుణ్ణి కొరడాతో నూరుదెబ్బలు కొట్టండి," అని తన భటులను ఆజ్ఞాపించాడు.



భటులు ఇరవైఅయిదు దెబ్బలు కొట్టేసరికల్లా ఇబన్, "ఆగండి!" అన్నాడు. తనకు ముట్టినదానిలో మూడువంతులు మస్రూర్ సొత్తన్న విషయం అతనికి జ్ఞాపకం వచ్చింది.

ఖలీఫా వాళ్ళిద్దరిమధ్యా జరిగిన ఏర్పాటుగురించి తెలుసుకుని, మిగిలిన దెబ్బలు మస్రూర్‌ను కొట్టమని ఆజ్ఞఇచ్చాడు.

మస్రూర్ పాతిక దెబ్బలు తిన్నమీదట, "అల్లాసాక్షిగా, ఇంతవంతు నేను తీసుకోవటం అక్రమం. నాకిక అక్కర్లేదు!" అని అరిచాడు.

ఈ మాటవిని ఖలీపా విరగబడి నవ్వటమే కాకుండా, దెబ్బలు తిన్న ఇద్దరికీ చెరొక వెయ్యి దీనారాలూ ఇచ్చేశాడు.

## ప్రత్యేకత

ఒకప్పుడు యుద్ధంలో గాయపడిన ఒక సైనికుణ్ణి శస్త్రవైద్యుడిదగ్గిరికి తీసుకొచ్చారు. సైనికుడి డొక్కలో బాణం గుచ్చుకున్నది. వైద్యుడు కత్తెరతీసి పైకి పొడుచుకువచ్చిన మేర బాణాన్ని కత్తిరించి, ఇక పోవచ్చునన్నాడు.



సైనికుడి బంధువులు "బాణంములికి లోపలే ఉండిపోయిందే?" అన్నారు.

"అది మనపనిగాదు అంతరంగిక వ్యాధులు బాగుచేసే వైద్యుడిదగ్గిరికి తీసుకుపొండి," అన్నాడు శస్త్రవైద్యుడు.



## శతమొండి

ఒక రైతు గడ్డం గొరిగించుకుని తన పెళ్ళాం దగ్గిరికి వెళ్ళి, "గడ్డం యెంత నున్నగా గొరిగించానో చూడు!" అన్నాడు. "నువు గొరిగించుకోవటమేమిటి? గడ్డం కత్తిరించుకున్నావు!" అన్నది రైతు పెళ్లాం. "అబద్ధమాడుతున్నావే, పిశాచమా! నేను గొరిగించుకున్నాను," అన్నాడు రైతు. "లేదు, కత్తిరించుకున్నావు." అన్నది పెళ్ళాం. రైతు పెళ్ళాన్ని చావగొట్టి, "గడ్డం గొరిగించుకున్నానని ఒప్పుకోకపోయావో నిన్ను నదిలో ముంచేస్తాను!" అన్నాడు. "నువ్వేమన్నా చెయ్యిగాక, గడ్డం కత్తిరించుకున్నావు!" అన్నది పెళ్లాం. రైతు పెళ్ళాన్ని నదిదగ్గిరికి ఈడ్చుకుపోయి, "చెప్పు! గొరిగించుకున్నానని చెప్పు!" అన్నాడు. "కత్తిరించుకున్నావు!" అన్నది పెళ్ళాం. రైతు, "గొరిగించుకున్నాననూ!" అంటూ పెళ్ళాన్ని నీళ్ళలోకి ముంచాడు. పెళ్ళాం ఇక మాట్లాడలేదు. అందుకని ఆమె చెయ్యి పైకెత్తి రెండు వేళ్ళు కత్తెరలాగా ఆడించింది.

హాస్య కథ

# అగ్నిపరీక్ష

కైరోనగరపు ప్రసిద్ధ హాస్యగాడయిన గోహాను ఒకసారి పొరుగువాడొకాయన భోజనానికి పిలిచాడు. గోహా అసలే భోజనప్రియుడు. అందుకనే అతన్ని అభిమానులు తరుచు భోజనాలకు పిలిచేవాళ్లు. ఎవరు పిలిచినా గోహా తప్పక వెళ్ళేవాడు. ఈసారికూడా అలాగే వెళ్ళాడు. కాల్చిన కోడిని తెచ్చి గోహాముందు పెట్టారు. దానినుంచి ఒక చిన్నముక్కతీసి గోహా నమలటానికి యత్నించాడు. అది తోలులాగా పంటికింద సాగిందిగాని నములుడు పడలేదు.

వెంటనే గోహా ఆ కోడిని మక్కావేపు ముఖంఉండేలాగా తిప్పిపెట్టి స్వస్తివాచకం చదివాడు.



ఇదిచూసి నిర్ఘాంతపోయిన గృహస్తు, "గోహా, ఏమిటీ అత్యాచారం? కోడి కళేబరానికి స్వస్తివాచకం చదవొచ్చా?" అన్నాడు.

గోహా ముక్కుమీద వేలేసుకుని, "అన్నన్నా! ఇది కోడా? పైకి అలాగ కనిపిస్తున్నదిగాని, నిజానికిది మహాపతివ్రత అయిన స్త్రీరత్నం! ఈమెను అగ్నిహోత్రంలో వేసినాకూడా అగ్నిహోత్రుడీమెను అంటలేకపోయాడు!" అన్నాడు.

గృహస్తు సిగ్గుపడి, ఆ కోడిని లోపలికి పంపేసి, గోహాకు సరిఅయిన భోజనం పెట్టించి పంపేశాడు.

చీనీ హాస్య కథ

# పండితుడు

ఒక మనిషి పొడుగాటి కర్రపట్టుకుని ఒక నగరంచేరాడు. అతను కర్ర నిలువుగా పట్టుకుని పోవాలని చూస్తే నగరద్వారం కర్రకంటె పొట్టి అయింది. అడ్డంగా పట్టుకుంటే కర్రకు ఇరుకయింది.

ఏమిచెయ్యటానికీ పాలుబోక ఆ మనిషి చూస్తూఉండగా దారేవెళ్ళే ఇంకోమనిషి విషయం తెలుసుకుని, "సమీపంలోనే గొప్ప పండితుడున్నాడు. ఆయన సలహా అడగటం మంచిది. ఆయనతప్ప ఈ చిక్కు మరెవరూ విప్పలేరు!" అన్నాడు.



సరిగా అదే సమయానికి అదృష్టవశాత్తూ ఆ పండితుడు గాడిద ఎక్కి అటుగా రావటంతటస్థించింది. పెద్ద చిక్కు వచ్చింది సలహాచెప్పాలని కర్రగలవాడూ, దారే పొయ్యేవాడూ కోరగా పండితుడు అలాగే చెబుతానన్నాడు.

కాని ఈలోపల వాళ్లిద్దరూ ఒక చిత్రం గమనించారు. పండితుడు గాడిద వీపుమీద కూచోక తుంటిమీద కూచుని ఉన్నాడు.

అలా కూచోవటానికి కారణమేమని వాళ్ళు పండితుణ్ణి అడిగారు.

"కళ్ళెంతాడు పొడుగుకావటంచేత ఇలా కూచోవలిసి వచ్చిందని ఎంత వెర్రివెధవకూడా తెలుస్తుందే!" అన్నాడు పండితుడు.

---

తల్లి: (వద్దంటున్నా వినక నదిలో ఈదబోతున్న కొడుకుతో) ఇదుగో చెబుతున్నా! ఆ నదిలో కాస్తా ముణిగిపొయ్యావంటే నిన్ను మళ్ళీ గడపలో అడుగు పెట్టనివ్వను! తరవాత నీ యిష్టం!

చీనీ హాస్య కథ

# లక్ష్యదేవత లక్ష్యం

సుంగ్ రాజవంశంలో ఒక మహావీరుడుండేవాడట. అతని కొకసారి రణరంగంలో పరాజయం సంభవించే పరిస్థితి ఏర్పడింది. సమయానికి ఒక దేవుడు అడ్డుపడి, స్వయంగా పోరాడి, అతన్ని గెలిపించాడు.



ఇందుకు కృతజ్ఞుడై మహావీరుడు, "అయ్యా, నాకు విజయభిక్ష పెట్టిన తమరెవరు ?" అని అడిగాడు.

"నేను లక్ష్యదేవతను !" అని జవాబు వచ్చింది.

"నాపై తమకింత అనుగ్రహం ఎందుకు కలిగిందో తెలుసుకోవచ్చా?" అని అడిగాడు మహావీరుడు.

"నేను నీకు చాలా రుణపడి ఉన్నాను. నువు విలువిద్య నేర్చుకునేటప్పుడు ఒక్కసారయినా నన్ను బాణంతో కొట్టి ఉండలేదు !" అన్నాడు లక్ష్యదేవత.



"నన్ను తేనెతో కలిపితింటే చాలా రుచిగా వుంటాను !" అన్నది శిఖామూలం దుంప.

"పోవే, వదరుబోతా ! నువు లేకుండానే నేను రుచిగా ఉంటాను !" అన్నది తేనె.

# పురాతన జంతువులు

నూరారుకోట్ల ఏళ్లక్రితం మన భూమి ఎట్లా ఉండేదో చూడగలిగినట్టయితే మనకు అనేక విచిత్ర విషయాలు గోచరిస్తాయి. ఈనాడు నీరున్న చోట్ల ఆనాడు నీరు లేదు, ఈనాడు నేల ఉన్న చోట్ల ఆనాడు నేల లేదు. ఆనాటి నీరూ, నేలాకూడా ఈనాటివాటికి చాలా భిన్నంగా ఉండేవి. ఆనాటి నేలపై ప్రాణి అన్నది—అధమం ఒక గడ్డిపరకకూడా—ఉండేదికాదు. జీవరాసులన్నీ నీటిలోనే ఉండేవి. వాటిలో కొన్ని ఒకే కణం శరీరంగా గలవి, కొన్నిటికి ఇంకా హెచ్చు కణాలుకూడా ఉండేవి. అవి నీటిలో పుట్టి, నీటిలో పెరిగి, నీటిలోనే నశించేవి. ఆనాటి జీవులలో కొన్ని వృక్షవిభాగంకిందికి వచ్చేవి, మిగిలినవి జంతుజాతులకింద జమ అయేవి. కాని అప్పట్లో ఈ తేడా అంత స్ఫుటంగా ఉండేదికాదు.

అనేక లక్షల ఏళ్ళు గడిచినకొద్దీ కొత్త కొత్త జీవరాసులు "పరిణామం" చెంద సాగాయి. వాటి శరీరాలు రానురాను "అభివృద్ధి" అయాయి. చివరకు ఆనాటి సముద్రాల నిండా "కశేరుకరహిత" ప్రాణులు వెలిశాయి. "కశేరుకరహితం" అంటే వెన్నెముక లేనిదని అర్థం. నిజానికి వెన్నెముక గల జంతువులు ఇంకా ఎంతో కాలానికిగాని రాలేదు. అయినా తరువాత వచ్చిన జంతువులతో పోల్చి వీటిని "కశేరుకరహిత" జీవులంటున్నాం. ఈ "కశేరుకరహిత" ప్రాణులకు వెన్నెముకేగాక ఏ ఎముకా లేదు. మన అస్థిపంజరాలు మన శరీరాలలో దాగిఉంటాయి, కాని ఈ "కశేరుకరహిత" ప్రాణుల శరీరాలు వాటి అస్థిపంజరాలలోపల దాగిఉండేవి—అంటే వాటి అస్థిపంజరాలు శరీరాలను కప్పిఉండేవి.

ఎన్నో సహస్రాబ్దాలపాటు "కశేరుకరహిత" ప్రాణులు భూమిపైగల ప్రాణికోటిలో అత్యుత్తమ జీవులుగా విలసిల్లటంచేత శాస్త్రజ్ఞులు ఒక యుగానికి వాటి పేరుపెట్టారు. దాని పేరు "కశేరుకరహిత ప్రాణి యుగం."

రమారమి 50 కోట్ల ఏళ్ళక్రితం భూమిపై జీవించిఉండిన అతి ముఖ్యమైన "కశేరుకరహితప్రాణి" పేరు ట్రైలోబైట్. దీని నిడివి నాలుగంగుళాలుమాత్రమే అయినా ఈ జాతికి చెందిన ప్రాణులు అత్యధిక సంఖ్యలో ఆనాటి సముద్రాల అడుగున, అప్రతిహతంగా సంచరిస్తూ, పదికోట్ల ఏళ్ళపాటు పోటీ అనేది లేకుండా తమ సాటి ప్రాణులైన నత్తలు, కాకిచిప్పలు, చుక్కచేపలు మొదలైనవాటి మధ్య జీవించాయి.



ట్రైలోబైట్

# గ్రహాలు : కుజుడు



భూమి తరవాత సూర్యుడికి దగ్గిరిగాఉన్న గ్రహం కుజుడు. ఇది సూర్యుడు చుట్టూ తిరిగేటప్పుడు సూర్యుడికి 12,84,40,000 మైళ్ళలోకి వచ్చి, 15,48,60,000 మైళ్ళ దూరానికి పోతూ ఉంటుంది.

* కుజుడి వ్యాసం నిడివి 4,352 మైళ్ళు. ( భూమిది దాదాపు 8 వేల మైళ్ళు); ప్రమాణంలో ఈ గ్రహం భూమికి సుమారు ఏడింతలు చిన్నది, బరువులో దాదాపు పదింతలు చిన్నది. కుజగ్రహంమీది వైశాల్యం, భూమి వైశాల్యంలో నాలుగోవంతుకు కొంచెం అధికంగా ఉంటుంది.

* భూమిమీద పడే సూర్యరశ్మిలో సగంకూడా కుజుడికి లేదు. అందుచేత కుజగ్రహం మీది ఎండా, వెలుతురూ భూమిమీదకన్న చాలా సామ్యంగా ఉంటాయి.

* కుజగ్రహం సూర్యుడిచుట్టూ ఒక సెకండుకు సుమారు 15 మైళ్ళ వేగంతో, మన రోజుకు 12,87,000 మైళ్ళ చొప్పున నడుస్తుంది. ఈ విధంగా నడుస్తూ కుజుడు సూర్యుణ్ణి ఒక్కసారి చుట్టి రావటానికి 686 రోజుల 23 గంటల 31 నిమిషం పడుతుంది. అది కుజుడికి ఒక సంవత్సరమన్నమాట. ఇది మన సంవత్సరానికి దాదాపు రెట్టింపు.

* మన భూమికి అన్నిటికన్న దగ్గిరిగా వచ్చే గ్రహం శుక్రుడు. దాని తరవాత దగ్గిరిగా వచ్చేది కుజుడే. కాని మనకు శుక్రుణ్ణి పరిశీలించటంకంటే కుజుణ్ణి పరిశీలించటం చాలా తేలిక. అందుచేత ఈ గ్రహాన్ని గురించి తెలుసుకున్నంతగా మనం ఇతర గ్రహాలను గురించి తెలుసుకోలేం.

* కుజగ్రహంకూడా భూమిలాగే 24 గంటలకొకసారి దానిచుట్టూ అది తిరుగుతుంది. అది దానికొక రోజు.

* భూమిమీదలాగే కుజగ్రహంమీదకూడా ఋతువులున్నాయి. దాని ఉత్తరదక్షిణ ధృవాలలో మంచుపేరుకోవటమూ, తరిగిపోవటమూ కనిపిస్తుంది.

* కుజగ్రహంమీద మనుషులున్నా లేకపోయినా చెట్లుమొదలైన ప్రాణులుండటానికి తగిన అవకాశాలున్నాయి.

* ఈ గ్రహంచుట్టూ తిరిగే రెండు ఉపగ్రహాలున్నాయి. కాని ఇవి చాలా చిన్నవి. వీటినుంచి వచ్చే వెన్నెల చందమామ యిచ్చే వెన్నెలలాగా కాంతివంతంగా ఉండదు.

చీనా హాస్య కథ

## తినటానికి కాకపోతే సవారీకి!

సరిగా భోజనంవేళకు ఒక గృహస్థు ఇంటికి గుర్రంమీద ప్రయాణంచేస్తూ ఒక అభ్యాగతి వచ్చాడు. గృహస్థు దొడ్డిలో బోలెడన్ని కోళ్ళూ, బాతులూ ఉన్నాయి, కాని గృహస్థు పిసినారి.



"మిమ్మల్ని భోజనానికి ఉండమందును గాని, ఇంట్లో కూరానారా ఏమీ లేదు," అన్నాడు గృహస్థు అభ్యాగతితో.

"ఫరవాలేదు. కత్తి ఒకటి ఇప్పించండి. నా గుర్రాన్ని కోసి వండటానికిస్తాను" అన్నాడు అభ్యాగతి వినయంగా.

గృహస్థు నిర్ఘాంతపోయి, "అయితే మరి, మీరు తిరిగి ప్రయాణం ఎలా సాగిస్తారు?" అన్నాడు.

"దానికేం లెండి? మీ బాతుల్లో ఒకటి అరువిద్దురుగాని, దానిమీద సవారీ అయి చక్కా పోతాను!" అన్నాడు అభ్యాగతి.

---

## నక్క - ఎండ్రకాయ

ఒకనాడొక నక్కా, ఎండ్రకాయా కలుసుకుని మాట్లాడుకుంటూన్నప్పుడు ఎండ్రకాయ, "మనం పరుగుపందెం వేసుకుందామా?" అన్నది.

"ఓ! అలాగేకానీ!" అన్నది నక్క.

నక్క బయలుదేరబోయే సమయాన ఎండ్రకాయ, నక్క తోకపట్టుకున్నది.

నక్క గమ్యస్థానం చేరి ఎండ్రకాయకోసం వెనక్కుతిరిగి చూసింది.

ఆ సమయంలో ఎండ్రకాయ నక్క తోకను వదిలి కిందపడి, "నీకోసం ఎంతోసేపుగా చూస్తున్నా! ఇంత ఆలస్యం చేశావేం?" అన్నది.

# గోడమీది బొమ్మ - 3 (ఆఖరిబొమ్మ)

ఒకరోజున, చ్యాంగ్ భార్య అయిన "జ్యోతి" ఇంట్లో ఒంటరిగా ఉండగా, ఇద్దరు మనుషులు ఏడుస్తూ గుమ్మంముందుగా వచ్చారు. "జ్యోతి" వారిని పిలిచి, "ఎందుకలా ఏడుస్తున్నారు?' అని అడిగింది.

"అమ్మా, మేము రాజుగారి వేటగాళ్ళం. మా ప్రభువుకు పావురాల కూర ఇష్టం. కాని ఈరోజు ఎంత వెతికినా మాకు ఒక్క పావురమైనా చిక్కింది కాదు. రాజుగారికి కోపంవస్తుంది. మాతలలు ఎగిరిపోవటం తప్పదు!" అన్నారు వాళ్ళు.

"ఇంతేగద! నేను మీకు సహాయంచేస్తాను. ఇక్కడే ఉండండి," అంటూ "జ్యోతి" లోపలికి వెళ్ళి, కాగితంనుంచి రెండు పావురాల బొమ్మలు కత్తిరించి, వాటి మీద "ఉఫ్" అని ఊదింది.

వెంటనే ఆ కాగితం పావురాలకు ప్రాణంవచ్చింది. అవి అక్కడినుంచి ఎగురుతుంటూ బయటికి వెళ్ళాయి.

అవి వాకిలిగుండా బయటికి ఎగిరి వచ్చేటప్పుడు రాజుగారి వేటగాళ్ళు వాటిని పట్టుకున్నారు. తమ పని పూర్తి అయినందుకు సంతోషించి, "జ్యోతి"కి తమ కృతజ్ఞత తెలిపి, వాళ్లు వెళ్ళిపోయారు.

రాజుగారు ఆ రాత్రి పావురాల కూరతిని, వాటిరుచికి ఆశ్చర్యపడి, "ఇంత రుచిగల పిట్టలు ఎక్కడ దొరికాయి?" అని వంటవాడిని అడిగాడు.

వంటవాడు తనకు తెలియదని చెప్పాడు. అంతట రాజుగారు వేటగాడి కోసం కబురంపాడు. ఏం ప్రమాదం జరిగిందో ఏమిటో అనుకుని వణికిపోతూ, వేటగాడు రాజుగారిదగ్గరకు వచ్చాడు. రాజుగారు వాడిని, ఆ పక్షులు ఎక్కడ దొరికిందీ చెప్పవలసిందని అడిగాడు. వాడు జరిగినదంతా ఉన్నది ఉన్నట్టు చెప్పేశాడు. ఈవిధంగా రాజుగారికి "జ్యోతి"ని గురించి తెలియవచ్చింది.

ఆతరవాత—

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1955 నవంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ సెప్టెంబర్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఆలమందలు ఇళ్ళ కొచ్చేటి వేళ

రెండవ ఫోటో: పల్లెవనితలు నీళ్లు తెచ్చేటి వేళ

పంపినవారు: రాంపల్లి నాంచారమ్మ,

C/o రాంపల్లి భాస్కర సోమయాజులుగారు — నర్సాపురం.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# కాగితం



అందరికీ కాగితం అవసరం. క్లాసులో నోట్స్ తీసుకోవటానికీ, లెక్కలు చెయ్యటానికీ కాగితం కావాలి. ఉత్తరాలు రాసుకోవటానికి కాగితం కావాలి. రాయనివాళ్లు కూడా కాగితం ఉపయోగపరుస్తారు; మనం వార్తాపత్రికలూ, ఇతర పత్రికలూ, పుస్తకాలూ కొంటాం. వాటిని అచ్చు వేయటానికి ఎంతో కాగితం పడుతుంది. నెలనెలా "చందమామ" అచ్చువేయటానికి అనేక టన్నుల కాగితం ఖర్చవుతుంది. పోస్టర్లూ, కరపత్రాలు అచ్చువెయ్యటానికీ, పొట్లాలు కట్టటానికీ, బంగీలు చుట్టటానికీ కాగితం అవసరం.

ఒక్కొక్క అవసరానికి ఒక్కొక్క రకం కాగితం ఉంటుంది. ఈ పత్రిక టైటిల్ ఒకరకం కాగితంమీదా, కథలు వగైరా ఇంకోరకం కాగితం మీదా అచ్చయి ఉండటం చూడవచ్చు. దినపత్రికలు తక్కువరకం కాగితంమీద అచ్చువేస్తారు. మంచి పుస్తకాలకు మేలురకం కాగితం ఉపయోగిస్తారు.

కొన్ని దేశాలలో ఎక్కువ కాగితం ఉత్పత్తి అవుతుంది. మరి కొన్ని దేశాలలో తక్కువ ఉత్పత్తి అవుతుంది.

అమెరికాలో ఏటా తయారయే కాగితమంతా అక్కడి జనాభాకు సమంగా పంచితే ఒక్కొక్కరికీ దాదాపు 17 మణుగుల కాగితం వస్తుంది. ఇండియాలో తయారయే కాగితం అలాగే ప్రతి భారతీయుడికీ పంచితే తలకొక అరవీశె మాత్రమే వస్తుంది. మనదేశంలో కాగితం ఉత్పత్తి ఇంకా చాలా పెరగాలి.

కాగితం తయారు చెయ్యటానికి సరిఅయిన మానుపిండి అవసరం. ప్రతి దేశంకూడా తనకు విరివిగా లభించే చెట్ల ఆధారంతో కాగితం చేసుకోవటం నేర్చుకోవాలి. దీనికోసరం పరిశోధనలు జరగాలి. ఇలాటి పరిశోధనలు సాగించటానికిగాను మన ప్రభుత్వం డెహ్రాడూన్‌లో అటవీ పరిశోధనాలయం ఒకటి ఏర్పాటుచేసింది. వెదురునుంచి దిన పత్రికలకూ, ఇతర చౌకప్రచురణలకూ పనికివచ్చే "న్యూస్ ప్రింట్" కాగితం చేసే పద్ధతిని ఈ పరిశోధనాలయం కనిపెట్టింది. ప్రస్తుతం ఏటా 4 లక్షల టన్నుల వెదురు మనదేశంలో "న్యూస్ ప్రింట్" ఉత్పత్తికి వాడుక అవుతున్నది.

ఉత్తర ప్రదేశంలో "ఉల్లా" అనే ఒక రకం గడ్డి విరివిగా పెరుగుతోంది. దీనినుంచి మేలురకం కాగితం తయారై, రాసుకోవటానికీ, అచ్చువెయ్యటానికీ పనికివస్తుంది. ఈ ప్రాంతంలోనే "చీడ్" అనే చెట్లున్నాయి. వీటినుంచి బంగీలు కట్టడానికి ఉపయోగపడే కాగితం తయారవుతుంది. బొంబాయి రాష్ట్రంలో "ఖర్గోల్" అనే చెట్లనుండి బంగీలు కట్టటానికీ, అచ్చువెయ్యటానికి పనికివచ్చే కాగితం తయారవుతున్నది.

"వాటిల్" అనే చెట్లు చాలా ఉపయుక్తమైనవి. వాటి బెరడునుంచి వచ్చే ద్రావకం తోళ్ళ పరిశ్రమకు అత్యవసరమైనది. దీనిని దిగుమతిచేసుకోవలసివస్తున్నది. అందుచేత మన ప్రభుత్వం ఈ "వాటిల్" చెట్లసాగుబడిని ప్రోత్సహించటానికి యత్నిస్తున్నది. వాటిల్ చెట్ల బెరడు తోళ్లపరిశ్రమకు పనికివస్తుంది. కట్టెను పిండిచేసి కాగితం తయారుచేసేటందుకు వీలున్నది.

1913 లో మనదేశంలో నాలుగే కాగితం మిల్లులుండేవి ; ఏటా 27 వేల టన్నుల కాగితం మాత్రమే తయారయేది. 1954 నాటికి మిల్లులసంఖ్య 19 కీ కాగితం వుత్పత్తి లక్షన్నర టన్నులకూ పెరిగింది.

తొలి పంచవర్షప్రణాళిక ముగిసేనాటికి మనదేశంలో ఏటా 2 లక్షల టన్నుల కాగితం ఉత్పత్తి అవుతుంది.



# వార్తలు-విశేషాలు

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో, గ్రామ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరాకుగాను ప్రత్యేక శ్రద్ధ తీసుకోబడుతున్నది. ఆంధ్రప్రభుత్వం ఇందుకుగాను 11 కోట్ల రూపాయిలను కేటాయించగలదు.

*  *  *  *

మధ్యప్రదేశ్‌లోని బిటుల్ జిల్లాలో యురేనియం గనులు వున్నట్టు కనుగొనబడింది. కాని ఇక్కడ లభ్యమయే యురేనియం అంత శ్రేష్టమైనది కాదని తెలుస్తున్నది.

*  *  *  *

ఆదోనిలో ఒక బట్టల మిల్లు స్థాపించబోతున్నారు. ఇందులో దాదాపు 18000 మంది చేనేత పారిశ్రామికులకు పని కల్పించబడగలదు.

*  *  *  *

కర్నూలులోని జనరల్ ఆస్పత్రిలో 14 లక్షల 75 వేల రూపాయల ఖర్చుతో, మరి కొన్ని అదనపు సౌకర్యాలను ఏర్పాటుచేయటానికి ఆంధ్రప్రభుత్వం నిర్ణయించింది.

*  *  *  *

కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోని కొన్ని ప్రాంతాలలో ముడి ఇనుము లభ్యంకాగల అవకాశాలున్నవని తెలుస్తున్నది. ఇండియా ప్రభుత్వానికి చెందిన మిస్టర్ మహమ్మద్ జియావుద్దీన్ ఈ సందర్భంగా పరిశోధనలు జరిపారు. ప్రస్తుత అంచనాలనుబట్టి దాదాపు అయిదు లక్షల టన్నులవరకు ముడి ఇనుము దొరికే అవకాశాలున్నవి.



జూలై 29వ తేదీన లోకసభలో, దశాంశపద్ధతిలో నాణెములను ప్రచారంలో పెట్టేందుకు, ప్రభుత్వానికి అధికారం యిస్తూ బిల్లు ఆమోదించబడింది. ఈ పద్ధతిలో రూపాయికి నూరు విభాగాలు ఉండగలవు.

*　　　*　　　*　　　*

మధ్యప్రదేశ్‌లో సోవియెట్ నిపుణులు నిర్మిస్తున్న భిలాయ్ ఉక్కు కర్మాగారం 1959 డిసెంబరు నాటికి పూర్తిగా పని ప్రారంభిస్తుందట. 1958 సంవత్సరం ఆఖరుకే రెండు 'బ్లాస్ట్ ఫర్‌నేస్'లు తయారుకాగలవు. ఈ కర్మాగారంలో ఏటా 7,20,000 టన్నుల తయారైన ఉక్కు, 2,00,000 టన్నులు ఇనుపరేకు, లక్ష టన్నుల తుక్కు ఇనుము తయారుకాగలవు.

*　　　*　　　*　　　*

కేంద్రప్రభుత్వ ఇనుము, ఉక్కు వ్యవహారాల మంత్రిత్వశాఖ కార్యదర్శి అయిన శ్రీ భూతలింగం (ఐ. సి. ఎస్.) హిందూస్తాన్ స్టీల్ లిమిటెడ్ కంపెనీ డైరెక్టర్లబోర్డు అధ్యక్షులుగా నియమించబడ్డారు. ఇంతకుముందు అధ్యక్షుడుగావున్న శ్రీ యస్. యభేరా (ఐ. సి. ఎస్) తమ పదవికి రాజీనామాయిచ్చారు.

*　　　*　　　*　　　*

వికలాంగులు, అంధులు అయిన పిల్లల చదువుకుగాను ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి రెండుకోట్ల రూపాయలు ఖర్చుకాగల ఒక పథకం తయారుచేయబడింది. ఇందుకుగాను దేశంలో వికలాంగులకు సంబంధించిన వివరాలు సేకరించబడగలవు.

*　　　*　　　*　　　*

విశాఖపట్టణంలో వ్యాగనుల విడిభాగాలు చేర్చి, వ్యాగనులను తయారుచేసే యంత్రాగారం నెలకొల్పబడగలదు. విదేశాలనుంచి దిగుమతి అవుతున్న వ్యాగనులు దెబ్బ తింటున్నాయి కనక యీ చర్య తీసుకోబడుతున్నది.



# చిత్రకథ



ఒకనాటి సాయంకాలం దాసు, ఊరిబయట వున్న మామిడితోటలోకి షికారు బయలుదేరాడు. వెంట 'టైగర్' వున్నది. తోటలో హఠాత్తుగా దాసుకు ఒక కుందేలు కనిపించింది. ఇంకేం 'టైగర్'ను ఉసికొలిపి దాసు దానివెంటపడ్డాడు. కుందేలు అతివేగంగా చెట్లల్లోనుంచి పారిపోసాగింది. ఎలా అయినా దాన్ని చేజిక్కించుకోవాలన్న ఆత్రంలో వున్న దాసు దాని వెనకనే పరిగెత్తాడు. కాని, పాపం హఠాత్తుగా ఒక చెట్టుచాటున అతడికి ఒక పెద్ద ఎలుగుబంటి ఎదురైంది. దాసు కేకపెట్టి వెనక్కి పారిబోయేసరికి, ఆ ఎలుగుబంటి, వాసుగా మారింది!



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

పల్లెవనితలు నీళ్లు తెచ్చేటి వేళ

పంపినవారు:
ఆర్. నాంచారమ్మ - నర్సాపురం

